## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్
నమో నారాయణాయ
సరస్వత్యై నమః

ఆర్షవిజ్ఞాన పరిషత్తు

# ఆర్షధర్మ సూత్రములు

(వశిష్ఠాది మహర్షులు)



యాన్యస్మాకం సుచరితాని
తాని త్వయోపాస్యాని
నో ఇతరాణి

మేము చేసిన సత్కర్మలు నీవు చేయవలెను
మా యితరమైన పనులను చేయవలదు

తైత్తిరీయోపనిషత్తు

చర్ల గణపతిశాస్త్రి

ఆ దిన్సృష్టికి ముందు కేవల మొకేయాత్మంబవైయుండి యా
మీఁదన్ సత్త్వరజస్తమోగుణములన్ బెంపొంది భిన్నుడవై
కాదే సృష్టియుఁ దత్స్థితిప్రళయముల్ గావించి మోదింతువా
వేధో విష్ణుహరత్రిమూర్తికిని నివ్వే నీకు మా దండముల్

మూర్తి యదొక్కటె విడి చేసె మూడు పనులు
ముందు వెనుక మూఁడింటికి మామూలు మాట
హరి హరున కాది, హరుఁడొకప్డతని కాది
వారికిని బ్రహ్మ, బ్రహ్మకు వారునాది

# విషయ సూచిక



మృతే భర్తరి క్లీబేచ, దేశాంతరగతేపిచ
రోగస్థేపతితే పత్యౌ, పతిరన్యో విధీయతే

భర్త చనిపోయినా, నపుంసకుడైనా, దేశాంతరము పోయినా
రోగియైనా పతితుడైనా మరొక పతి విధించబడును.

(మనువు)

ఇది స్త్రీ ధర్మాదులలో చేర్చుకోవలెను.

# సూచిక

పెద్దలయిన పూర్వులు ముందుగా తాము ధర్మము లాచరించి పిదప ఇతరులకుఁ జెప్పిరి. ఇప్పుడో కేవలము పరోపదేశములోనే పాండిత్యము చూపుచున్నాము. మనము ఆచరించుటలో ఆ పాండిత్యము చూపినచో ఎంతయు బాగుండెడిది. ఇందువల్ల నేడనేక కష్టసమస్య లుత్పన్నమగుచున్నవి. ధర్మము చెప్పు శిష్టులు నిష్కాములై యుండవలయు ననియు లేక కనీసము వారియాస్తియంతయు కుండెడు ధాన్యమె యయియుండవలయునని నిర్వచించిరి. పూర్వము మనభారత వర్షము నిష్కామముగా నెట్టి త్యాగమయ జీవితము గడపెనో ఈ యార్ష ధర్మసూత్రములు చూపును. నేఁడు ఈ యార్ష ధర్మములు మనము చెప్పుకొనుటలోఁ గారణము పూర్వపు స్థితికిని ఇప్పటికిని భేధము తెలియుటకే నేఁటి ప్రస్తుతపు వ్యవస్థలో వీనికెంత స్థానమున్నది. వీనిని మనమెంత ఆచరించఁగలము. ఆచరింప వీలుకాని నేఁటి సంఘ వ్యవస్థలో వీని స్థానమెంత? అట్లయినపుడు ఇవి చెప్పుకొని లాభమేమి? పోనీ ఇవి తెలుఁగులో వ్రాసిన నావంటి అల్పుఁడేమి చేయుచున్నాఁడు. అనునవి సరియైన ప్రశ్నలు కావు. ఎట్లు జీవింపవలయును ఎట్లు జీవించినచో సర్వులకు శాంతి ఆనందము లుండును? అట్టిశాంతి యానందము పొందుటకు మరల మనమిప్పుడు ప్రయత్నము చేయవలదా? ఒకరినొకరు పీడించుకొని జలగలవలె ఒకరొకరి రక్తమును ఇట్లు త్రావవలసినదేనా? ఇంతకుమించి గత్యంతరము లేదా? బలవంతుఁడు బలహీనునికి జ్ఞాని అజ్ఞానికి ఆనందయుతుఁడు ఆనందహీనునికి ఏమియు సాయము చేయలేఁడా? ఒకవేళ అట్లు బలవంతులు బలహీనులను జ్ఞాని అజ్ఞానులను పీడించుచు తిన్నగా నడవక వారిని సరియైన విధముగాఁ జూడనిచో

వారి కర్మలచే వర్ణత్వమును పొందినది." అని భారతము చెప్పు చున్నది. అందుచే సర్వవర్ణములు ధర్మయుక్తములే గాని వేఱుగావు. అవి క్రమముగా మనుష్యుల యధర్మ ప్రవృత్తిచే వ్యవహారములో ఎక్కువగాను తక్కువగాను చూడఁబడినవి. కాని అది సరికాదు. శూద్రులు తక్కువ బ్రాహ్మణు లెక్కువకాదు ఇదే గీత చాలాచోట్ల నొక్కిచెప్పినది. ఎవ్వఁడైనను సరే తన ధర్మమును సరిగా చేయనిచో వాడు నరకగామి యగును. సరిగా నడచినచో స్వర్గము పొందును. కావున సర్వవర్ణముల వారు తమ తమ స్వభావ నియతమైన కర్మల ద్వారా నడచుచు హెచ్చు తగ్గులు లేకుండ తమ కర్మలను ధర్మయుక్తముగా నిష్కామ ప్రవృత్తితో చేయవలసియున్నది. అట్లుచేసి భేద భావములు లేకుండ నడచి స్వర్గమోక్షములలో సమభాగు లవుదురుగాక.

ఇట్లు

చర్ల గణపతిశాస్త్రి

(((•)))

## గ్రంథ సంకేతములు

| | |
|---|---|
| వసి=వసిష్ఠుఁడు | ఆప=ఆపస్తంబుడు |
| గౌ=గౌతముఁడు | తైత్తి=తైత్తిరీయోపనిషత్తు |
| మను=మనుస్మృతి | విష్ణు=విష్ణుపురాణము |
| యాజ్ఞ=యాజ్ఞవల్క్యుఁడు | శివధర్మ=శివధర్మఖండము |
| బో=బోధాయనుఁడు | పరా=పరాశరస్మృతి |
| ఛాందో=ఛాందోగ్యోపనిషత్తు | నారద=నారదస్మృతి |
| సిద్ధాంత=సిద్ధాంత దర్శనము | అత్రి=అత్రిసంహిత |
| దక్ష=దక్షస్మృతి | యమ=యమస్మృతి |

నిత్య మనంత ము నాద్యము

ప్రత్యంత జ్ఞేయ మఖిలలో కా శ్రియమున్

సత్యస్వరూప మవ్యయ

ముత్యంతానందతత్త్వ మద్వయము గొలుతున్

తొలి నారాయణుఁ డాత్మరూపమున నెందున్ క్షీర

మల్లొప్పి లీలలకై అవయి పాలమీఁగడయటుల్

వ్యక్తాకృతిన్ బొంది నిర్మల మాకాశము, నందు గాలి,

జ్వలనం బాపై నటన్ నీరు, నందిల యన్నంబయి

జీవియై వెలుఁగు నాయీశున్ సదా మ్రొక్కెదన్,

నారాయణున్ గురున్ దేవున్

దండ్రిన్ మ్రొక్కి వినమ్రతన్

వచింతు వార్త ధర్మంబు

వే గణపతి నాముఁడన్.

# ఆర్షధర్మ సూత్రాణి

## ప్రథమోఽధ్యాయః

## వర్ణ ధర్మాః

1. సూ. అథాతః పురుష-నిశ్శ్రేయసార్థం ధర్మజిజ్ఞాసా. (వసి 1. 1. )

వివ: లోకాః ధ్రియంతే అనేనేతి ధర్మః

2. సూ. జ్ఞాత్వా చానుతిష్ఠన్ ధార్మికః ప్రశస్యతమో భవతి లోకే, ప్రేత్యచ స్వర్గం లోకం సమనుశ్నుతే. (వసి. 1-2)

3. సూ. వేదో ధర్మమూలం (గౌ. 1. 1)

4. సూ. తద్విదాం చ స్మృతిశీలే (గౌ. 1. 2)

5. సూ. తదలాభే శిష్టాచారః ప్రమాణం (వసి 1. 4)

వివ: "వేదస్స్మృతిః సదాచారః స్వస్యచ ప్రియమాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మలక్షణం.

విద్వద్భిః సేవితః సద్భి ర్నిత్య మద్వేషరాగిభిః
హృదయే నాభ్యను జ్ఞాతో యో ధర్మస్తం నిబోధత
(మను. 2. 12)

సమ్యక్సంకల్పజః కామో ధర్మమూలమిదం స్మృతం.
(యాజ్ఞ. ఉపోద్ఘాత 7)

# ఆర్ష ధర్మ సూత్రములు

## మొదటి అధ్యాయము

## వర్ణ ధర్మములు

1 సూ. మఱియింక స్త్రీపురుషుల మోక్షసిద్ధికై ధర్మజిజ్ఞాస చేయఁబడుచున్నది.

వివ: లోకములు దీనిచే ధరింపఁబడును గాన ధర్మముఅని వ్యుత్పత్తి.

2 సూ: తెలిసికొని యాచరించుచు ధార్మికుఁడు లోకమున మిక్కిలి ప్రశంసింఁదగినవాఁడగును. చనిపోయియు స్వర్గలోకము నొందును. (వసి. 1. 2)

3 సూ. వేదము ధర్మమునకు మూలము. (గౌ. 1. 1)

4 సూ. వేదవేత్తల స్మృతులు శీలమును ధర్మమునకు మూలము, (గౌ. 1. 2)

5 సూ. అవి లభింప నపుడు శిష్టుల యాచరణమే ప్రమాణము. (వసి 1. 4)

వివ:_ వేదము, స్మృతి, సదాచారము, తన యాత్మకు ప్రియమైనది అని నాలుగు విధములుగ ధర్మలక్షణము చెప్పుదురు అని మనుస్మృతి 1. 127. ద్వేష రాగములులేని విద్వాంసులైన సత్పురుషులచే సేవితమై హృదయముచే అనుజ్ఞ యివ్వఁబడినది ధర్మముఅని దెలిసి కొనుఁడు. (మను. 2. 1) సత్సంకల్పమువలనఁ గలిగిన కోరికయిది యంతయుధర్మమునకుమూలము.(యాజ్ఞ. ఉపోద్ఘాత. 7)

చోదనా లక్షణోఽర్థో ధర్మ ఇతి మీమాంసకాః

శ్లో॥ శ్రేయః సాధనతా హ్యేషాం
(ఏషాం=ద్రవ్య క్రియాగుణాదీనాం) నిత్యం వేదాత్ప్ర తీయతే
తాద్రూప్యేణచ ధర్మత్వం తస్మాన్నేంద్రియగోచర
ఇతిభాట్టాః

స్వర్గాదిఫలసాధన భూతం కార్యనియోగా
పూర్వశబ్దై రుచ్యమానో ధర్మ ఇతిప్రాభాకరాః

కృతేతు మానవాః ప్రోక్తాస్త్రేతాయాం గౌతమాః
స్మృతాః ద్వాపరే శంఖలిఖితాః
కలౌ పారాశరా మతా" ఇతి సామాన్యతయా కథితం,

6 సూ. శిష్టః పున రకామాత్మా. (వసి. 1. 5)

7 సూ. శిష్టాఃఖలు విగతమత్సరా నిరహంకారాః కుంభీధాన్యా అలోలుపా దంభదర్పలోభమోహక్రోధ వర్జితాః (బో. 1. 1. 5)

8 సూ. తదభావే దశావరా పరిషత్. (బో. 1. 1. 7)

9 సూ. చాతుర్వైద్యం వికల్పీచ అంగవిద్ధర్మపాఠకః ఆశ్రమస్థా స్త్రయో విప్రాః పర్ష దేషా దశావరా. (బో. 1. 1. 8)

వివ:- చతుర్వేదవిదః. వికల్పీ. మీమాంసకః, ధర్మపాఠకః బ్రహ్మచారీ, గృహస్థః, వానప్రస్థః, ఏతేదశ.

10 సూ. పంచవాస్య స్త్రయోవాస్యు రేకో వాస్యాదనిందితః ప్రతివక్తాతు ధర్మస్య నేతరేతు సహస్రశః (బో1. 1. 9)

వేదవాక్యవిహితమైనది ధర్మమని మీమాంసకులు. ఈ ద్రవ్య గుణ క్రియాదులు శ్రేయస్సునకు సాధనము లనుసంగతి వేదము వలనఁ దెలియుచున్నది. వేదరూపముగా అవి ధర్మములు గాన అవి యింద్రియములకు గోచరము కావు. అని భాట్టులు. స్వర్గాది ఫలములకు సాధనములై కార్యము నియోగము అపూర్వము అను శబ్దములచే చెప్పఁబడినది ధర్మము అని ప్రాభాకరులు. కృతయుగమున మనుధర్మము త్రేతయందు గౌతమ ధర్మము అని ప్రాభాకరులు. కృతయుగమున మను ధర్మము త్రేతయందు గౌతమ ధర్మము. ద్వాపరమున శంఖ లిఖితులు చెప్పిన ధర్మము. కలియుగమున పరాశరుడు చెప్పినదిధర్మము అనునది సామాన్యవచనము.

6 సూ. శిష్టుఁడనఁగాఁగోరికలులేనివాఁడు. (వసి.1. 1. 5

7 సూ. మాత్సర్యము. అహంకార, ములోలుపత్వము, ఆడంబరము, గర్వము, లోభము, మోహము, కోపములేనివారును పది దివముల వఱకే సరిపోవు ధాన్యముగలవారును శిష్టులు. (బో. 1, 1. 6)

8 సూ. అట్టి శిష్టులు లేనిచో దశావరపరిషత్తె ధర్మమునకు మూలము. (బో. 1. 1. 7)

9 సూ. నాలుగు వేదములు తెలిపినవారు. 4 మీమాంస శాస్త్రజ్ఞులు, 5 వేదషడంగవేత్తలు. 6 ధర్మశాస్త్రపాఠకులు. 7 బ్రహ్మచారి, 8 గృహస్థు 9 వానప్రస్థుఁడు 10 ఈ పదిమంతోఁ గూడినది దశావర పరిషత్తు అనఁబడు. [ బో 1. 1. 8 ]

10 సూ. అయిదుగురుగాని ముగ్గురుగాని లేకపూజనీయుఁడొక్కఁడుగాని ధర్మమును జెప్పఁగలరు. ఇతరులు వేలకొలఁది మందిగూడఁ జెప్పలేరు. [బో. 1. 1. 9]

11 సూ. అగృహ్యమాణకారణో ధర్మః [వసి. 1, 6.]

సర్వేషామపి కారణాని సంతి, తథాఽపితే స్పష్టతయా నగృహ్యంతే, తస్మాత్ అగృహ్యమాణ ఇత్యుక్తం, నతు అవిద్యమాన ఇతి.

శ్లో॥ ధర్మంజిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమంశ్రుతిః
ద్వితీయం ధర్మశాస్త్రంతు తృతీయంలోకస్యగ్రహః
[భార. అనుశాసనిక]

శ్లో॥ యోఽనుమన్యేత తేతూభే హేతుశాస్త్రాశ్రయాన్నరః
స సాధుభి ర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః
[మను 2. 11]

12 సూ బ్రహ్మపురోహితం రాష్ట్రమృధ్నోతి (వసి. 19. 4)

ఆ సముద్రాత్తు వై పూర్వాదాసముద్రాత్తు పశ్చిమాత్
త యోరేవాంతరం గిర్యోరార్యావర్తం విదుర్బుధాః
మను. (2. 22)

13 సూ. తస్మిన్ దేశే యే చాచారాస్తే సర్వత్ర ప్రత్యేతవ్యాః (వసి. 1. 8)

14 సూ. గంగాయమునయో రంతరేప్యేకే. (వసి 1. 10)

15 సూ. యావద్వా కృష్ణమృగో విచరతి తావద్బ్రహ్మవర్చస మిత్యన్యే. (వసి. 1. 14)

16 సూ. దృష్టో ధర్మవ్యతిక్రమః (గౌ. 1. 3)

11 సూ. ధర్మము కారణములచే గ్రహింపఁదగినదిగాదు.
(వసి 1. 6.)

విప:_ అన్నిటికి కారణములుండును గాని సరియైన కారణము లను ఊహింపక తప్పుకారణములచే తప్పు నిర్ణయింతుము గాన గ్రహింపఁదగినది కాదు అనియేగాని కారణములు లేనిది అని చెప్పఁ బడలేదు. ధర్మము తెలిసికొనఁగోరు వారికి మొదటిప్రమాణము శ్రుతి (వేదము) రెండవది స్మృతి (ధర్మశాస్త్రము) మూఁడవది లోకుల యుక్తమైన ఆచారము. ఎవఁడైతే హేతుశాస్త్రమును తర్కము ననుస రించి శ్రుతులను స్మృతులను అవమానించునో అట్టి వేద నిందకుఁడైన నాస్తికుని సాధువులు బహిష్కరింపవలెను.

12 సూ. బ్రహ్మవేత్త పురోహితుఁడు (సంచాలకుడు) గా నున్న రాజ్యము వృద్ధి పొందును.　　　　(వసి. 1. 14)

సూ. తూర్పు సముద్రము. పడమర సముద్రము, వింధ్య హిమవత్పర్వతములు వానికి మధ్యనున్న ప్రదే శమును ఆర్యావర్త మందురు.　　　　(మను. 2. 22)

13 సూ. ఆ దేశమందలి ధర్మములు అచారములు అన్ని దేశము లందును గ్రహింపఁదగినవి　　　　(వసి. 1. 8.)

14 సూ. గంగాయమునల మధ్యనున్న ధర్మములను గ్రాహ్యములని కొందఱు.　　　　(వసి. 1. 10.)

15 సూ. కృష్ణమృగము ఎంతవఱకు సంచరించునో అంత వఱకు బ్రహ్మవర్చస్సుగల దేశమని మఱికొందఱు (వసి 1. 14.)

16 సూ. వేదవేత్తలలో ధర్మవైరుద్ధ్యము చూడఁబడినది.
(గౌ. 1. 3)

17 సూ. సాహసం చ మహతాం (గౌ. 1. 4.)

వివ:- మహతాం సాహసకర్మ ధర్మమూలం న భవతీత్యర్థః

18 సూ. నతు దృష్టార్థేఽ వరదౌర్బల్యాత్ (గౌ. 1. 5.)
వివ:- దృష్టప్రయోజన విషయే నికృష్టవ్యసత్త్వాత్ తేషాం శీలం ధర్మమూలం నభవతి

19 సూ. తుల్య బలవిరోధే వికల్పః (గౌ. 6)

వివ:- తుల్య బలశ్రుత్యాదివ్యాఖ్యానాం పరస్పర విరోధే వికల్పః స్యాదిత్యర్థః

20 సూ. తద్యఇహ రమణీయచరణా అభ్యాశోహ యత్తే రమణీయాంయోని మాపద్యేరన్ బ్రాహ్మణయోనిం వా క్షత్రియ యోనింవావైశ్య యోనిం వాథ య ఇహ కపూయచరణా అభ్యాశోహయత్తే కపూయాం యోనిమాపద్యేరన్ శ్వయోనింవా సూకరయోనింవా చండాలయోనింవా. (ఛందో 5 అ. 10 5 7)

బ్రాహ్మణోఽస్యముఖమాసీత్. బాహూరాజన్యః కృతః ఊరూతదస్యయద్వైశ్యః పద్భ్యాం శూద్రోఽజాయత
(పురుషసూక్తము. వసి. 4. 2.)

21 సూ. బ్రహ్మ వా ఇద మగ్ర ఆసీదేక మేవ తదేకం సన్న వ్యభవత్ (బృహదారణ్యక 1. 4 11)

తత్ శ్రేయోరూపమత్యసృజత క్షత్రం ......... సనైవవ్యభవత్సవిశమసృజత్ ....... సనైవవ్యభవత్ సశౌద్రంవర్ణమసృజత్.

17 సూ. గొప్పవారి ప్రవర్తనలో నిరంకుశతయుఁ గన్పట్టు చున్నది. (గౌ. 1. 4)

వివ:- గొప్పవారిదైనను వారి నిరంకుశ ప్రవర్తన ధర్మమునకు మూలముగాదని భావము.

18 సూ. కనిపించు ప్రయోజనముల విషయమున నికృష్టులకు దౌర్బల్యముండుటవలన వారి శీలము ధర్మమునకు మూలముగాదు. (గౌ 1. 5)

19 సూ. సమానబలముగల శ్రుత్యాది వాక్యములకు పరస్పరము విరోధము గలిగినప్పుడు వికల్పవిధానము గలుగునని తెలియునది. (గౌ. 1. 6)

ఎవరైతే పవిత్రమైన ఆచరణగలవారో వారు జన్మను బ్రాహ్మణ జన్మమో, క్షత్రియ జన్మమో, వైశ్య జన్మమో పొందుదురు. చెడ్డ ఆచరణను జేయువారు నీచజన్మను, కుక్కజన్మనో, పందిజన్మనో, చండాలజన్మనో పొందుదురు, (ఛాందో 4. 10. 5.)

20 సూ. ఈ పరమేశ్వరుని ముఖము బ్రాహ్మణుఁడు. బాహువులవల్ల క్షత్రియుఁడు పుట్టెను. వైశ్యుఁడు అతని తొడలు పాదములవల్ల శూద్రుఁడు పుట్టెను. [పురుష సూ.

21 సూ. ఈ బ్రహ్మ యొక్కటే మొదట నుండెను. అదొక్కటే సర్వకర్మలను జేయఁజాలనిదయ్యెను. [బృహదారణ్యక 1. 11.]

పిదప తేజోరూపమైన క్షత్రియ జాతిని బుట్టించెను.... అదియుఁ జాలనిదయ్యెను....పిదప ఆ బ్రహ్మము వైశ్యజాతిని బుట్టించెను.... అదియుఁ జాలనిదయ్యెను. అప్పుడది శూద్రజాతిని బుట్టించెను.అప్పడది శక్తిగలదయ్యెను.

పూషణ, మయంవై, పూషా ఇయం హీదం సర్వం పుష్యతి యుదిదం కించ [1. 4. 14]

22 సూ. తదేతద్బ్రహ్మక్షత్రం విట్ శూద్రః
[ బృహదారణ్యక 4. 1. 16 ]

వివ:- "న విశేషోఽస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మమిదంజగత్.
బ్రహ్మణాపూర్వ సృష్టంహి కర్మభిర్వర్ణతాంగతం."
[భార]

చాతుర్వర్ణ్యంమయా సృష్టంగుణకర్మవిభాగశః
భగవద్గీత ]

23 సూ. దేశధర్మ, జాతిధర్మ, కులధర్మాన్. శ్రుత్యభావా దబ్రవీన్మనుః [ వసి. 1. 16]

24 సూ. చత్వారోవర్ణా బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రాః
[ వసి. 2. 1 )

25 సూ. గుణేభ్యో భేదో జాతి క్రియాకాలానాం.
(సిద్ధాంత. 1. 4. 12)

వివ:- శుద్ధసత్త్వేన బ్రాహ్మణః, సత్త్వాశ్రయరజః ప్రాధాన్యేన క్షత్రియః, తమోగుణాశ్రియరజః ప్రాధాన్యేనవైశ్యః రజోగుణాశ్రయతమః ప్రాధాన్యేన శూద్రోజాయతే. కాల. కృతః త్రేతా, ద్వాపర కలియుగాః.

ఈ భూమియే పూష, ఇక్కడ ఏదైతే కలదో అది అన్నిటిని పోషించును. [బృ. 1. 414]

22 సూ. ఈవిధముగా బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు, శూద్రులు గలిగిరి. (బృహ 4. 1. 16)

వివ:- "వర్ణములలో విశేషమేమియు లేదు. ఈ జగమంతయు బ్రహ్మకు సంబంధించినదే. బ్రహ్మచే పూర్వము ఒకటిగా సృజింపబడి వాని వాని కర్మలచే వర్ణభేదము పొందెను. [భార. శాంతి 188]

"వానివాని గుణకర్మల విభాగమును బట్టి నాలుగు వర్ణములు నాచే సృజింపబడెను." [భగవద్గీత]

23 సూ. దేశధర్మములను గూర్చి, జాతి ధర్మములను గూర్చి కులధర్మములను గూర్చి శ్రుతి చెప్పకపోవుటవలన వానిని మనువు చెప్పెను. [వసి. 1. 16]

24 సూ. బ్రాహ్మణులు క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అని వర్ణములు నాలుగు. [వసి. 2. 1]

25 సూ. గుణములంబట్టి జాతికి, క్రియకు కాలమునకు భేదము గలుగును. [సిద్ధాంతము 1. 4. 12]

వివ:- శుద్ధసత్త్వగుణముచేత బ్రాహ్మణుఁడును, సత్త్వమునకు ఆశ్రయమగు రజోగుణము ప్రధానముగా నుండుటచే క్షత్రియుఁడును. తమోగుణమునకు ఆశ్రయమగు రజోగుణము ప్రధానముగా నుండుటచే వైశ్యుఁడును రజోగుణమునకు ఆశ్రయమగు తమోగుణము ప్రధానముగా నుండుటచే శూద్రుఁడును నవుదురు. కాలము కృత త్రేతా ద్వాపర కలియుగములు. అని నాలుగు విధములు.

బ్రాహ్మణః క్షత్రియోవైశ్యస్త్రయో వర్ణా ద్విజాతయః
చతుర్థ ఏకజాతిస్తు శూద్రోనాస్తితుపంచమః
[మను. 10. 4]

సంకీర్ణజాతీనా మశ్వతర వన్మాతాపితృ వ్యతిరిక్త జాత్యంతరత్వా న్నవర్ణత్వం, తేనహి శూద్రాత్ బ్రాహ్మణ్యాం జాతో చండాలస్తు సంకీర్ణజాతిః నతు పంచమ ఇతిభావః.

శూద్రాద్వైశ్యాయాం మాగధః క్షత్రియాయాం క్షత్తా బ్రాహ్మణ్యాం చండాలః [బో. 1. 9. 6]

26 సూ. త్రయోవర్ణా ద్విజాతయో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యాః (వసి. 2. 2)

27 సూ తేషాంమాతురగ్రేఽధిజననం ద్వితీయం మౌంజీ బంధనం (వసి. 2. 3)

28 సూ. తత్రాస్య మాతా సావిత్రీ పితాత్వాచార్య ఉచ్యతే. (వసి. 2. 4)

29 సూ. వేదప్రదానాత్పితేత్యాచాచార్యమాచక్షతే. (వసి. 2. 5)

30 సూ. ద్వయము హైహ పురుషస్య రేతో బ్రాహ్మణ స్యోర్ధ్వంనాభే. రర్వాచీన మన్యదధ్యదూర్ధ్వంనాభే స్తేనాఽస్యాఽ నౌరసీ ప్రజా జాయతే. (వసి. 2. 7)

బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు వైశ్యుఁడు అను మూఁడు వరములవారు ద్విజాతులు; నాల్గవవాఁడైన శూద్రుఁడు ఒకేజాతి గలవాఁడు. పంచముఁడు అనువాఁడైతే లేఁడు.

వివ:- బ్రాహ్మణులు, క్షత్రియులు వైశ్యులు అనువారిని ద్విజాతులు అనఁగా ద్విజులందురు. నాల్గవవాఁడగు శూద్రుఁడు ఏకజాతిగల వాఁడె, అయిదవజాతి లేదు అని మనుస్మృతి (10 అ. 4 శ్లో) సంకరజాతులు తల్లిదండ్రులజాతివారే గాని యన్యజాతివారు గారుకనుక శూద్రునివలన బ్రాహ్మణ స్త్రీయందుఁ బుట్టిన చండాలుఁడనువాఁడు సంకరజాతివాఁ గాని యయిదవజాతివాఁడుగాఁడు.

శూద్రునినుండి వైశ్యస్త్రీయదదు మాగధుఁడు, క్షత్రియ స్త్రీయందు క్షత్త బ్రాహ్మణస్త్రీ యఁదు చండాలుఁడును గలుగుదురు. (బోధ. 1. 9. 6.)

26 సూ. బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు అను ముగ్గురు ద్విజులనఁబడుదురు. వసి 2. 2. )

27 సూ. వారికి మొదటిజన్మ తల్లిగర్భమువల్లను రెండవ జన్మ మౌంజీబంధనము (జ్ఞానోపదేశసంస్కారము) వల్లనగును. (వసి. 2. 3)

సూ ఆ మౌంజీ బంధనమందు ఇతనికి తల్లి సావిత్రి దేవతో పాసనయును తండ్రి యాచార్యుఁ డనియు అనఁబడు. (వసి, 2.4)

29 సూ, వేదముఁ జదివించుటవల్ల నాచార్యుని ద డ్రి యందురు (వసి 2. 5)

30 సూ. బ్రాహ్మణుని వీర్యము రెండువిధములుగా నున్నది. నాభికిఁపైని మొదటిది. నాభికిఁ గ్రిందట రెఁడవది నాభికిఁ పైనున్న వీర్యముచే ఔరస సంతానము గలుగును. (వసి, 2.7)

31 సూ. యదుపనయతి జనన్యాం జనయతి, యత్సా
ధూకరోతి. (వసి. 2. 8)

32 సూ. తస్మాచ్ఛ్రోత్రియ మనూచాన మప్రజోసీతి న
వదంతి. (వసి. 2. 10)

33 సూ. అథ యదర్వాచీనం నాభే స్తే నేహ్యాస్యారసీ
ప్రజా జాయతే (వసి. 2. 9)

34 సూ. నహ్యస్య విద్యతే కర్మ కించి దామౌంజీ బంధ
నాత్ వృత్త్యా శూద్రసమో జ్ఞేయో యావద్వేదే న జాయతే.
(హారీతోదాహరణము. వసి. 2. 12)

35 సూ. జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః
(వసి. 2. 14)

36 సూ. విద్యాహవై బ్రాహ్మణ మాజగామ గోపాయ
మాం: శేవధిస్తేఽహమస్మి, అసూయకా యాఽనృజవేఽయ
తాయ నమాంబ్రూయా. వీర్యవతీ తథాస్యామ్
(నిరుక్తం. 68 పుట)

37 సూ. విజ్ఞాయ తేహి త్రిభిః ఋణైః ఋణవాన్
బ్రాహ్మణో జాయతే (వసి. 11. 12)

యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యో బ్రహ్మచర్యేణ
ఋషిభ్యః ఇత్యేష వా అనృణోయజ్వా పుత్రో బ్రహ్మచర్య
వానితి (వసి. 11. 47)

31 సూ. తల్లి కనిన పిదప బ్రహ్మోపదేశమునకై తన యొద్దకుఁ దెచ్చితొన్నదియుఁ దెచ్చి సాధువుగా నొనర్చినది యునగు సంతానము ఔరస సంతానము. (వసి. 1. 8.)

32 సూ. కనుక వేదము జదివించు శ్రోత్రియుని సంతానము లేనివాఁడవు అని పలుకరు. (వసి. 1. 10)

33 సూ. మఱి యింక నాభికిఁ గ్రింది వీర్యముచే ఔరస సంతానము గలుగుచున్నది. (వసి. 2. 6)

34 సూ. మౌంజీబంధనమువఱకు బ్రాహ్మణునికి మఱి యే కర్మయులేదు. వేదోపదేశరూపమగుజన్మ లేనంతవఱకు వృత్తిచే శూద్రసముఁడని తెలియఁదగు.

(హారీతుఁడు వసి. 2. 12)

35 సూ. జన్మచే శూద్రుఁడును కర్మచే ద్విజుఁడుగను మనుజుఁడుండును.

36 సూ. విద్యబ్రాహ్మణుని యొద్దకు వచ్చి నన్నుఁ గాపాడుము నీకు నేను నిధివంటిదానను, అసూయ, వక్రత్వము, గలవానికిని నియమరహితునికిని నన్ను ఉపదేశింపకుము అసూయాదులు లేనివారికి ఉపదేశించినట్లయినచో నేను వీర్యవంతురాలనై యుందును అనియనెను.

37 సూ. బ్రాహ్మణుఁడు మూఁడు ఋణముతోఁ గూడ బుట్టునని తెలియు చున్నది.

సూ. యజ్ఞముచే దేవఋణమునుండి సంతానముచే పితృ ఋణమునుండి బ్రహ్మచర్యముచేత ఋషి ఋణమునుండి విడును. ఇట్లు ఇతఁడు ఋణములేనివాఁడై యజ్వయై పుత్రవంతుఁడై బ్రహ్మచర్యము గలవాఁడగును. (వసి. 11. 47)

38 సూ. షట్కర్మాణి బ్రాహ్మణస్య (వసి. 2. 19)

39 సూ. స్వాధ్యాయాధ్యయన, మధ్యాపన యజనం యాజనం దానం ప్రతిగ్రహశ్చేతి. (వసి. 2. 20)

వివ:- స్వాధ్యాయాధ్యయనం = వేదాధ్యయనం. జ్ఞానబోధక గ్రంథాధ్యయనంచ.

40 సూ. యోగస్తపోదానం సత్యం శౌచందయాశ్రుతం విద్యావిజ్ఞానమాస్తిక్య మేతద్బ్రాహ్మణ లక్షణం. (వసి. 6. 20)

శ్లో॥ శమోదమః తపశ్శౌచం క్షాంతిరార్జవమేవచ.
జ్ఞాన విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మస్వభావజం.
(గీత. 18. 42)

శౌర్యంతేజో ధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనం.
దాన మీశ్వరభావశ్చక్షత్రకర్మ స్వభావజం.
(గీత 18. 43)

కృషిగోరక్షవాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం.
పరిచర్యాత్మకంకర్మకం శూద్రస్యాపిస్వభావజం.
(గీత 13. 44)

38 సూ. బ్రాహ్మణుఁడు చేయవలసిన కర్మలాఱు.
(వసి. 2_19)

39 సూ. స్వాధ్యాయాధ్యయనము, వేదముల అధ్యయనము చేయించుట, యాగము చేయుట, యాగముచేయించుట, దానముచేయుట, దానము చేసినదానిని ప్రతిగ్రహించుటయును.

వివ:- స్వాధ్యాయాధ్యయనము = వేదాధ్యయనము, జ్ఞాన బోధక గ్రంథాధ్యయనమును.

40 సూ. యోగము, తపస్సు బహిరింద్రియనిగ్రహము, దానము, సత్యము, శుచి, దయ వేదశాస్త్రాదివఠనము, విద్య, విజ్ఞానము, అస్తికత్వము ఈ గుణములు గలిగియుండుటయె బ్రాహ్మణుని లక్షణము. (వసి. 9_20)

వివ :- అంతరింద్రియనిగ్రహము, బహిరింద్రియనిగ్రహము, శుచి, ఓర్పు, ఋజుత్వము, జ్ఞానము, జ్ఞానపూర్వకాచరణము, అస్తికత్వము ఇవి స్వభావసిద్ధమగు బ్రాహ్మణకర్మలు, శౌర్యము తేజస్సు, సమర్థత, యుద్ధములో పారిపోకుండుట, దానము ఈశ్వరభావము, ఇవి స్వభావ సిద్ధమగు క్షత్రియకర్మలు. వ్యవసాయము, గోరక్షణ, వర్తకము ఇవి స్వభావసిద్ధమైన వైశ్య కర్మలు. సేవారూపమైన వృత్తి స్వభావసిద్ధమగు శూద్రకర్మ.
(గీత. 18, 42, 43, 44.)

41 సూ. త్రీణిరాజన్యస్య (వసి. 2, 21)

42 సూ. అధ్యయనం యజనందానంచ, శస్త్రేణప్రజా పాలనం స్వధర్మస్తేన జీవేత్. (వసి. 2, 22)

43 సూ. ఏతాన్యేవత్రీణి వైశ్యస్య కృషిర్వాణిజ్యం పాశు పాల్యం కుసీదంచ (వసి. 2, అ. 23)

44 సూ. ఏతేషాం పరిచర్యా శూద్రస్య. (వసి. 2, 24)

45 సూ. అనియతా వృత్తిః (వసి. 3, 25)

46 సూ. బ్రాహ్మణస్యాధికాః ప్రవచనయాజనప్రతిగ్రహాః (గౌ. 9, 2)

47 సూ, బ్రాహ్మణాతిక్రమోనాస్తి విప్రేవేదవివర్జితే జ్వలంత మగ్ని ముత్సృజ్య నహి భస్మని హూయతే. (వసి. 3, 11)

48 సూ. యేశాంతదాన్తాః శ్రుతపూర్ణకర్ణా, జితేంద్రియాః ప్రాణివధాన్నివృత్తాః ప్రతిగ్రహేసంకుచితాగ్రహస్తాస్తే బ్రాహ్మణాస్తారయితుం సమర్థాః (వసి. 6, 21)

సేవాశ్వవృత్తిరాఖ్యాతా తస్మాత్తాం పరివర్జయేత్ (మను 14,6)

సూ. ద్విజానాం కృష్యాదిరూపస్వతంత్ర వా వృత్తిః వరం న తు శ్వవృత్తిః కదాపిచ.

వేదః కృషి వినాశకః కృషిర్వేదవినాశకః (మను. 98)

49 సూ. రాజ్ఞోఽధికం రక్షణం సర్వభూతానాం.(గౌ.9,7

41 సూ. క్షత్రియుడు చేయవలసిన కర్మలు మూడు(వసి2, 21)

42 స్వాధ్యాయముచదువుట, యాగముచేయుట,దానము చేయుటయును, శస్త్రముతోఁ బ్రజలను పాలించుట యతనికి స్వధర్మము దానివలన క్షత్రియుడు జీవింపవలెను,(వసి,2,22)

43 సూ, పై మూఁడే వైశ్యుడు చేయువలసిన కర్మలు, వ్యవసాయము, వర్తకము, పశువులను పాలించుట, ధనము వడ్డికిచ్చుటయు అనునవిఁ గూడ,

44 సూ శూద్రుడు వీరికి పరిచర్య సేయవలయును(వసి, 2,24)

45 సూ శూద్రునికి నియమితమగు వృత్తిలేదు(వసి 2,25

46 సూ మిగిలినవారికంటె బ్రాహ్మణునికి వేదముఁజెప్పుట యాగము చేయించుట, దానము ప్రతిగ్రహించుట యనునవి యధికము (గౌ 9, 2)

సూ స్వాధ్యాయముురాని బ్రాహ్మణుని విషయమున ఆ బ్రాహ్మణుని నతిక్రమించిన దోషము గలుగదు మండుచున్న యగ్నిని విడిచి వట్టి బూడిదలో హోమము చేయరుగదా (వసి 3, 11)

48 సూ. శమదమసంపన్నులు, వేదవిదులు, హింస చేయనివారును, దానము బ్రతిగ్రహించుటలో సంకోచము గలవారు నగు బ్రాహ్మణులు తరింపఁజేయు సమర్థులు (వసి 6, 12)

సేవావృత్తిని కుక్కవృత్తి యందురు, కనుక దానిని వర్జింపవలెను (మను 4, 6

సూ ద్విజులు వ్యవసాయము మొదలగు స్వతంత్ర వృత్తిని జేయుట మంచిది, కాని శ్వవృత్తి కుక్కవృత్తి యెన్నటికిఁ గూడదు

వేదము కృషిని నశింపఁ జేయును కృషి వేదమున నశింపజేయును

49 సూ సర్వప్రాణులను రక్షించుట యను కర్తవ్యము ఇతర వర్ణములకంటె నధికమైనది (గౌ 9, 7

50 సూ న్యాయ్యదండత్వం (గౌ 9, 8)

51 సూ బిభృయాద్బ్రాహ్మణాన్ శ్రోత్రియాన్ (గౌ 9, 9)

52 సూ సంగ్రామే సంస్థాన మనివృత్తిశ్చ (గౌ 9, 15)

53 సూ నకర్ణిభిర్నదిగ్ధైః ప్రహరేత్ (బౌ 1, 5, 10)

54 సూ భీత, మత్తో, న్మత్త, ప్రమత్త, వివన్నాహస్త్రీ, బాల, వృద్ధ బ్రాహ్మణైర్న యుధ్యేతాన్యత్ర ఆతతాయినః (బౌ 1 5 11)

వివ:- వివన్నాహ = కవచాదివర్జితాః

55 సూ అహింసయైవభూతానాం కార్యం శ్రేయోఽను శాసనం వాక్చైవ, మధురా, శ్లక్ష్ణా, ప్రయోజ్యా ధర్మమిచ్ఛతా (మను, 2, 159)

56 సూ పరంతు అహింసాప్రయోగే క్షమా, నిర్భయతా కార్యకుశలతా ప్రేమాద్యాత్మ బలసాధనాని ముఖ్యాని,

57 సూ విప్రాణాం జ్ఞానతో జ్యైష్ఠ్యం క్షత్రియాణాం తు వీర్యతః వైశ్యానాంధాన్యధనతః శూద్రాణా మేవ జన్మతః (మను, 2, 155)

58 సూ వరంస్వధర్మో విగుణః నపారక్యః స్వనష్ఠితః పర ధర్మేణ జీవన్హి సర్యః పతతి జాతితః (మను, 11 97)

50 సూ. అపరాధులను దండించునప్పుడు ధర్మము తప్పరాదు. (గౌ. 9, 8)

51 సూ. రాజులు వేదవిదులగు బ్రాహ్మణులను భరింప వలెను. (గౌ. 9, 9)

52 సూ యుద్ధమునందుండి వెనుక దిరుగరాదు(గౌ.9,15)

53 సూ కర్ణాకారముగల శస్త్రములతోను విషాదులుపూయఁ దడిన యస్త్రములతోను గొట్టరాదు. (బో. 1,5,10)

54 సూ ఆతతాయులైనప్పుడు దక్క భయపడిన వారితోను, పిచ్చివారితోను, పారబడినవారితోను కవచాదులు ధరింపనివారితోను యుద్ధము చేయరాదు. (బో. 1,5,11)

55 సూ. ప్రాణులను పాలించుటలో అహింసచేతనే కార్యము నెఱపవలెను. ధర్మము గోరువాఁడు మధురమైన మెత్తని మాటలనే ప్రయోగింపవలెను. (మను. 1,159)

56 సూ. కాని స్త్రీహింసను ప్రయోగించునపుడు ఓర్పు, నిర్భయత్వము, కార్యములందు నేర్పు, ప్రేమ మొదలగు నాత్మబల సాధనములు ముఖ్యము.

57 సూ. బ్రాహ్మణులు జ్ఞానమువల్ల శ్రేష్ఠులు, క్షత్రియులు పరాక్రమమువల్ల శ్రేష్ఠులు, వైశ్యులు ధన ధాన్యముల వల్ల శ్రేష్ఠులు, శూద్రులు జన్మవల్లనే శ్రేష్ఠులు (మను. 2,155)

58 సూ. చక్కఁగా ననుష్ఠింపఁబడిన పరధర్మముకంటె స్వధర్మము శ్రేష్ఠము. పరధర్మముచే [వృత్తి] జీవించువాఁడు వెంటచే తనజాతి నుండి పతితుఁడగును. (మను. 11,97)

శమదమాదిగుణ విశిష్ట బ్రాహ్మణాది కులేజాతానాం బ్రాహ్మణత్వాది సంపాదననే మహానవకాశస్తస్మాత్ లోకాచార వశాచ్చ పురాణాదిషుజన్మనాజాతి వ్యవహారోఽక్రియత నతు జన్మ నైవేతి భావః. జీవికా సంపాదనంతు పరవృత్త్యా న కర్తవ్యం.

59 సూ. నోన్మేషశ్చేత్స్వవృత్తైరస్యజాతీయాః
(సిద్ధాంతదర్శన. 1,4,14)

యస్యయల్లక్షణం ప్రోక్తం పుంసో వర్ణాభివ్యంజకం
యదన్య త్రాపి దృశ్యేత తత్తేనైన వినిర్దిశేత్.
(భాగవత. 7స్కం. 11 అ. 35శ్లో.)

వివ:- బ్రాహ్మణస్య శమాదేః క్షత్రియస్య శౌర్యాదే, ర్వైశ్యస్య కృష్యాదేః, శూద్రస్య సేవాదేః స్ఫురణం న చేత్తర్హి తే భిన్న జాతీయాభవంతి, శమాద్యస్ఫూర్తౌ శౌర్యాది స్ఫురణం చేత్తర్హి బ్రహ్మకులోత్పన్నోఽపి క్షత్రియజాతీయః యదిపునః శౌర్యాద్యస్ఫూర్తౌ శమాదిస్ఫురణం తర్హి క్షత్రియకులోత్పన్నోఽపి బ్రాహ్మణజాతీయః, ఏవం వైశ్యశూద్రయోరపి బోధ్యం. వృత్తిస్థమపి చండాలం తం దేవా బ్రాహ్మణం విదుః అతఏవ విజృంభితబ్రహ్మవృత్తానాం వసిష్ఠాదిభిః పరీక్షితానాంగాధేయసుతాదీనాం భిన్నజాతీయానా మపి పురా బ్రాహ్మణత్వ మలంకృత మాసీదితి ఇతిహాసః సంగచ్ఛతే.

60 సూ. త్రయోవర్ణా బ్రాహ్మణస్యవశేవర్తేరన్.
(వసి. 1, 40

శమదమాది గుణములు గల బ్రాహ్మణకుటుంబమునఁ బుట్టినవారికి బ్రాహ్మణత్వాధి సంపాదనమందెక్కువ యవకాశముగలుఁ గాన లోకాచారవశము వశమువల్లను పురాణాదులందును జన్మచే జాతి వ్యవహరింపఁబడినదని భావము. బ్రాహ్మణజాతిలో స్నాన శేచ శాఖాహారములు మాత్రమింకను పోలేదు

59 సూ తమతమ వృత్తులు వికసింపనియెడల బ్రాహ్మణాదులు ఇతర జాతీయులగుదురు. (సిద్ధాంతదర్శన. 1,4,14)

ఏ పురుషునికి వర్ణమును దెలుపు ఏ లక్షణము చెప్పబడెనో ఏది ఇతర మగు చోట్లను గనిపించునో దాని చేతనే వర్ణ నిర్దేశము చేయవలయును. (స్కాం భాగవత. 7,11,35)
వివ:- బ్రాహ్మణునికి శమాదులు, క్షత్రియునికి శౌర్యాదులుః వైశ్యునికి కృష్యాదులు, శూద్రునికి సేవాదులు స్ఫురింపనిచో వారు ఇతర జాతీయులగుదురు శమాదులు స్ఫురింపక శౌర్యాదులు స్ఫురించినచో బ్రాహ్మణకులమునఁ బుట్టినను క్షత్త్రియుఁడేయగును. శౌర్యాదులు స్ఫురింపక శమాదులు స్ఫురించినచో క్షత్రియ కులమునపుట్టినను బ్రాహ్మణుఁడెయగును. ఇట్లే వైశ్యశూద్రులగూర్చి తెలియవలయును. వృత్తిలోనున్న చాండాలునిగూడ దేవతలు బ్రాహ్మణుఁడందురు అని స్మృతి, విజృభించిన బ్రహ్మవృత్తి పెరిగి, వసిష్ఠాదులచే పరీక్షింపఁబడిన విశ్వామిత్రాదులకు బ్రాహ్మణత్వముకలిగినట్లున్న యితిహాసము ఈరీతిగాఁ గుదురుచున్నది. [నిరంజనభాష్యము]

60 సూ. మూఁడు వర్ణములు బ్రాహ్మణుని వశమందుండవలయును. (వసి. 1, 40)

24 సూ తేషాం బ్రాహ్మణోధర్మాన్ ప్రబ్రూయాత్
(వసి. 1, 41)

62 సూ. తంరాజా చానుశిష్యాత్ (వసి. 1, 42)

63 సూ॥ రాజాతుధర్మేణానుశాసత్ షష్ఠంషష్ఠంధనస్య హరేత్
(వసి, 1, 43)

చల తశ్చైనాన్ స్వధర్మే స్థాపయేత్ (గౌ, 11)

64 సూ అగ్రం వృక్షస్యరాజానో మూలం వృక్షస్య బ్రాహ్మణాః తస్మాన్మూలం నహింసీయాన్మూలాదగ్రం ప్రరోహతి
(శంఖలిఖితస్మృతి 22)

ఇష్టాన్భోగాన్హివో దేవాదాస్యంతే యజ్ఞభావితాః
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేనఏవసః
(గీ 3, 12)

యజ్ఞశిష్టా శినః సంతోముచ్యంతే సర్వకిల్బిషం (గీత)

భుంజతేః కేవలం భుంక్తేయో పచత్యాత్మకారూద్ (గీత)

ఇతి ప్రథమోఽధ్యాయః

61 సూ. వారికి బ్రాహ్మణుడు ధర్మములు బోధింపవలెను (వసి 1, 41)

62 సూ. అతనిననుసరించి రాజు పాలింపవలెను (వసి, 1, 41)

63 సూ. రాజు ధర్మముగాఁ బాలించుచు ధనములోని ఆరవ భాగము గ్రైకొనవలయును. (వసి, 1, 43)

స్వధర్మమును తప్పి నడచిన వారిని రాజు వారి ధర్మమునందుంచ వలెను (గౌ, 11)

64 సూ. సంసారవృక్షమునకు రాజులు కొనలు, బ్రాహ్మణులు వేరులు కాన వేరులను జంపఁగూడదు. వేరునుండియే గదా కొనలు బయలుదేరును. (శంఖలిఖితస్మృతి, 2)

యజ్ఞముచే పోషింపఁబడినవారై దేవతలు మీకు ఇష్టభోగము లిచ్చెదరు. వారిచ్చినవి వారికిబెదలకియ్యక తాను తిన్న వాఁడు దొంగయే. (గీత, 3, 12)

ఇది మొదటి యధ్యాయము.

# వర్ణాశ్రమ ధర్మ సూత్రాణి

## బ్రహ్మ చర్యాశ్రమః

### ద్వితీయోఽధ్యాయః

శ్లో॥ దయా క్షమాఽనసూయాచ శౌచానాయస మంగళం
అకార్పణ్యా స్పృహత్వేచ సర్వసాధారణా ఇమే.

(బృహస్పతి)

శ్లో॥ క్షమాసత్యందమః శౌచం దానమింద్రియ సంయమః
అహింసా గురు శుశ్రూషా తీర్థానుసరణం దయా
అనభ్యసూయాచతథా ధర్మఃసామాన్య ఉచ్యతే

(విష్ణుస్మృతి 2, 16,17)

1 సూ. బ్రహ్మచారీ గృహస్థో వానప్రస్థః పరివ్రాజక ఇతి

(బో ", 6, 14)

వివ:_ ఇతః పరం బ్రహ్మచారి ధర్మా వక్ష్యంతే
చత్వారో బ్రాహ్మణస్యోక్తా ఆశ్రమాః శ్రుతిచోదితాః
క్షత్రియస్య త్రయః ప్రోక్తాద్వావేకో వైశ్యశూద్రయోః

(యోగియాజ్ఞ 1,28)

1 సూ. ఉపనయనం బ్రాహ్మణస్యాష్టమే (గౌ 1, 4)
వివ; బ్రహ్మోపదేశాయ గురోఃఉపసమీపేనయనమితి వ్యుత్పత్తిః

2 సూ. నవమే పంచమే వా కామ్యం [గౌ 1, 9]

3 సూ. గర్భాదిః సంఖ్యా వర్ణానాం [గౌ 1, 10]

4 సూ. తద్ద్వితీయం జన్మ [గౌ, 1, 11]

# వర్ణాశ్రమ ధర్మ సూత్రములు

## బ్రహ్మచర్యాశ్రమము

### రెండవ యధ్యాయము

దయ క్షమ అసూయ లేకుండుట శౌచము, అశ్రమము, రభము, దైన్యము లేకపోవుట నిస్పృహ ఇవి సర్వవర్ణసాధారణధర్మములు [బృహస్పతి] క్షమ సత్యము దమము శౌచము దానము ఇంద్రియ నిగ్రహము అహింస గురుసేవ తీర్థ సేవ దయ అనూయారాహిత్యము అన్నవి సర్వవర్ణ సామాన్య ధర్మములు

1 సూ. బ్రహ్మచారి, గృహస్థుఁడు వానప్రస్థుఁడు పరివ్రాజకుఁడని ద్విజులు నాల్గువిధములుగ నుందురు

వివ ; ఇప్పుడు బ్రహ్మచారి ధర్మములు చెప్పఁబడు చున్నవి.

1 సూ. బ్రాహ్మణునికి ఎనిమిదవయేట నుపనయనము చేయవలెను [గౌ 1, 4]

వివ : బ్రహ్మోపదేశమునకై గురు సమీపమునకుపంపుట ఉపనయన మని వ్యుత్పత్తి

2 సూ. అయిదవయేటఁ గాని తొమ్మిదయయేటఁ గాని చేయుట కామ్యము [గౌ 1, 9]

3 సూ. గర్భమగుట మొదలుకొని యేండ్ల లెక్కతెలియవలయు [గౌ 1, 11]

4 సూ. ఉపనయునము బ్రాహ్మణునికి రెండవజన్మము, [గౌ 1, 11]

5 సూ. ఏకాదశ ద్వాదశయోః క్షత్రియ వైశ్యయోః
[గౌ ,1 ,13]

6 సూ. అషోడ శాద్బ్రాహ్మణస్యాఽపతితా సావిత్రీ
[గౌ 1 14]

7 సూ. ద్వావింశతే రాజన్యస్య [గౌ 1, 15]

8 సూ. ద్వ్యధికాయ వైశ్యస్య [గౌ, 1, 16]

9 సూ అష్టా చత్వారింశద్వర్షాణి పౌరాణం వేదబ్రహ్మ చర్యం [బో 1, 2, 1]

వివ : పౌరాణం కృతయుగ పురుషాచరితం ప్రాచీనంవా

10 సూ. చత్వారింశతిం ద్వాదశవా ప్రతివేదం[బో1,2,2

11 సూ. గృహణాంతంవా [బో 1,2,4]

12 సూ. వేదా నధీత్య వేదౌవా, వేదంవాసియథాక్రమం
విప్లుబ్రహ్మచర్యో గృహస్థాశ్రమ మావిశేత్ [మను ]
వివ: బ్రహ్మచర్యం సమాప్యయో గృహస్థో భవతి న ఉపకుర్వేత్మ
ర్వాణహ బ్రహ్మచారీ మరణాంతం బ్రహ్మచారీ యో భవతిస
నైష్ఠికః

వేదస్వీకరణం పూర్వం, విచారోఽభ్యసనం జపః
తద్దానం చైవ శిష్యేభ్యః వేదాభ్యాసో హి పంచధా [దక్ష]

5 సూ. క్షత్త్రియునికి పదునొకండవ యేట, వైశ్యనికిఁ బండ్రెండవ యేట నుపనయనము చేయవలయును (గౌ 1,13)

6 సూ. పదునాఱవ యేడు వఱకు బ్రాహ్మణునికి సావిత్య్రుపదేశము దాటిపోదు. (గౌ. 1,15)

8 సూ. క్షత్త్రియునికి ఇరువదిరెండేడ్లు వఱకు దాటదు. (గౌ. 1, 16)

9 శూ_ ఉపనయన మయినది మొదలు నలుబదియెనిమిది యేండ్లు బ్రహ్మచర్యము పూనుట కృతయుగ పురుష సంబంధమగు వేద బ్రహ్మచర్యము. (బో 1, 21)

10 శూ_ ఇరువది నాలుగేండ్లుగాని లేక యొక్కొక్క వేదమును బట్టి పండ్రెండేడ్లు గాని బ్రహ్మచర్యమును పూనవలయు (బో. 1, 22)

11 శూ- వేదమును గ్రహించునంతవఱకుఁ గాని బ్రహ్మచర్యము పూనవలయు (బో 1, 2, 8)

12 శూ_ వేదము లన్నిటినిగాని, రెండు వేదములనుగాని యొక్క వేదమునుగాని క్రమముగాఁ జదివి పొరపాటు లేక బ్రహ్మచర్యము నడపి పిదప గృహస్థాశ్రమమునఁ బ్రవేశింప వలయును (మను

వివ:- బ్రహ్మచర్యము ముగించి గృహస్థుఁడగు వానిని ఉప కుర్వాణుఁ డందురు మరణాంతము వఱకు బ్రహ్మచారిగానుండు వానిని నైష్ఠికుఁ డందురు

మొదట వేద స్వీకారము పిదప వేద విచారణ వేదాభ్యాసము జపము శిష్యులకు వేదము చెప్పుట అని వేదాభ్యాసము ఐదు విధములు (దక్షుడు)

13 శూ- యథాపశుర్భారవాహీ న తస్యభుఫలశ్నుతే ద్విజ స్త్రద్ధాఽనభిజ్ఞో న వేదఫలమశ్నుతే (వ్యాసః)

14 సూ, యోఽనధీత్యవిధి వద్వేదం వేదార్థం న విచార యేత్ ససాన్వయః శూద్రసమః పాత్రితాం న ప్రపద్యతే (వాస)

**15 సూ, స్థాణురయం భారహారః కిలాభూదధీత్య వేదం, నవిజానాతియోఽర్థజ్ఞః స సకలం భద్రమశ్నుతే నాకమేతి జ్ఞాన విధూత పాప్మా (నిరుక్తం)**

16 సూ, ఉపనీయతుయశ్శిష్యం వేదమధ్యాపయేద్ద్విజః సకల్పం సరహస్యంచ తమాచార్యం ప్రచక్షతే [మను2,140]

17 సూ, యస్మాద్ధర్మానాచినోతి స ఆచార్యః(అప,1,1,14

18 సూ, ఉపనీయ గురుః శిష్యం శిక్షయే చ్ఛౌచ మాదితః ఆచారమగ్నికార్యం చ సంధ్యోపాసమేవచ (మను 2,70)

**19 సూ, తస్మై నద్రుహ్యేత్కదాచన (అప 1, 1, 15)**

**20 సూ, సహి విద్యాత స్తంజనయతి (అప 1,1, 16)**

13 సూ, బరువు మోయు ఎద్దు దాని ఫలము బొందనట్లు వేదార్థము నెఱుఁగని ద్విజుఁడు వేదఫలము నొందఁడు.

(వ్యాసుఁడు)

14 సూ, విధియుక్తముగ వేదము చదివి వేదార్థమును బరిశీలింపనివాఁడు వంశ సహితముగ శూద్రసముఁడై పాత్రత్వ మును బొందఁడు (వ్యాసుడు

15 సూ, ఎవఁడు వేదమును జదివి యర్థమును దెలిసికొనఁడోవాఁడు కేవలము బరువు మోయు నెద్దువంటివాఁడు. అర్థమును దెలిసిన వాఁడు సమస్త కళ్యాణమును పొఁదును జ్ఞానముచే పాపమును గడిగివేసికొన్న వాఁడై స్వర్గమునుపొందును

(నిరుక్తము)

16 సూ, ఎవఁడు తన దగ్గరకు తీసికొని శిష్యునికి వేదమును కల్పముతో రహస్యముతోఁ గూడఁ జదివించునో వానిని ఆచార్యుఁడందురు (మను 2,140)

17 సూ, ఎవఁడు ధర్మములను బోధించునో వాఁడు ఆచార్యుఁడు (ఆప, 1,1,14)

18 సూ, గురువు శిష్యుని దన దగ్గరకుఁ దీసికొని వచ్చి మొదట శుచిసత్త్వవర్తనను అగ్ని కార్యమును సంధ్యోపాసనను నేర్పవలయును (మను 2, 70)

19 సూ, ఎప్పుడును గురువుకు ద్రోహము తలపోయరాదు

(ఆప 1,1,15)

20 సూ, ఆ గురువె విద్యవలన నతనిని బుట్టించును గదా

(ఆప 1, 1, 16)

21 సూ, వేదాభ్యాసేనసతతం శౌచేన తప సైవ చ
అద్రోహేణ చ భూతానాం జాతిం స్మరతి పౌర్వికీం
పౌరిక్వీం సంస్మరన్ జాతింబ్రహ్మై వాభ్యసతేపునః
బ్రహ్మాభ్యాసేనచాజస్రమనంతం సుఖ మశ్నుతే
(మను 4, 149)

22 సూ- తచ్ఛ్రేష్ఠం జన్మ (ఆప 1,1,17

23 సూ- శరీరమేవ మాతాపితరౌ జనయతః [ఆప1,1,18

24 సూ- వసంతే బ్రాహ్మణ ముపనయీత
గ్రీష్మేరాజన్యం శరది వైశ్యం [ఆప 1,1,19]

25 సూ- గాయత్రీ త్రిష్టుబ్జగతీభి ర్యథాక్రమం
[చో 1,2,12]

26 సూ-యోఽనధీత్య ద్విజోవేద మన్యత్రకురుతేశ్రమం
సజీవన్నేవ శూద్రత్వమాశుగచ్ఛతి సాన్వయః [మను 124]

27సూ-అశ్రోత్రియా అననువాక్యా అనగ్నయోవా శూద్ర
సధర్మాణో భవంతి [వసి 3,4,]

28 సూ- ఉపేత స్యాచార్యకులే బ్రహ్మచారిణో వాసః
[ఆప 1,2,11]

29 సూ- ఆచార్యాధీనస్స్యా దన్యత్ర పతనీ యేభ్యః
[ఆప 1,2,18]

21 సూ. సతతము వేదము నభ్యసించుట చేతను శౌచము చేతను, తపస్సు చేతను, భూతములకు ద్రోహము చేయకపోవుట చేతను పూర్వ జన్మను స్మరించును, పూర్వ జన్మను సంస్మరించుచు తిరిగి బ్రహ్మనే యభ్యసించును. బ్రహ్మను అభ్యసించుటచే నెల్లపుడు అనింత సుఖము పొందును. (మను 4, 149)

22 సూ. ఆ గురువు ఉపదేశించిన విద్య వలనఁ గలిగిన జన్మమే శ్రేష్ఠమైనది. (ఆప 1,1,17)

22 సూ. తల్లిదండ్రులు శరీరమునే జనింపఁ జేయుదురు (ఆప 1,1,18)

24 సూ. వసంత ఋతువున బ్రాహ్మణునికి, గ్రీష్మ ఋతువున క్షత్రియునికి, శరదృతువున వైశ్యునికి ఉపనయనము చేయవలెను. (ఆప, 1,1,19)

25 సూ. గాయత్రీ త్రిష్టుబ్జగతీ ఛందస్సులచే వరుసగా నుపనయనము చేయవలయు.

26 సూ. వేదము చదువక మరొకదాని యందుఁ బరిశ్రమచేయు ద్విజుఁడు వంశ సహితముగా జీవించియే త్వరగా శూద్రత్వమొందును. (మను, 2,168)

27 సూ. అశ్రోత్రియులు, అననువాక్యులు అనగ్నులు నగు వారు శూద్ర ధర్ములగుదురు. (వసి, 3,4)

28 సూ. ఉపనీతుఁడగు బ్రహ్మచారి యాచార్యుని గురుకులమందు వసింప వలయు. (ఆప, 1,2,11)

29 సూ. ఉపనియకృత్యములందుఁగాక తక్కిన వాని యందు బ్రహ్మచారి యాచార్యునకధీనుఁడై యుండవలయు. (ఆప, 1,2,18)

30 సూ. హితకారీ గురో ర వ్రతిలోమయ న్వాచా
(అవ, 1,2)

31 సూ. మౌంజీ, ధనుర్జ్యా శాణీతి మేఖలాః
(బో, 1,2, 14)

32 సూ. కృష్ణ, రురు, బస్తాజినాన్యజినాని (బో, 1,2,15)

వివ:_ "అజినంత్వే వోత్తరం ధారయేత్" ఇతి ఆపస్తంభః

33 సూ. వాసాంసి శాణ, క్షామ, చీర, కుతపాం సర్వేషాం
(గౌ, 1,19)

34 సూ. కార్పాసంచాఽవికృతం (గౌ, 1,20)

సూ. కాషాయ మప్యేకే. [గౌ, 1,21]

సూ. వార్ క్షం బ్రాహ్మణస్య [గౌ, 1,22]

సూ, మాంజిష్ఠహారిద్రి ఇతరయోః [గౌ, 1_22]

35 సూ. బైల్వపాలాశౌ బ్రాహ్మణ దండౌ.
అశ్వత్థపైలవౌ శేషే [గౌ 1_24_25]

36 సూ_ యజ్ఞియో వా సర్వేషాం [గౌ- 1-26]

37 సూ- ముండ జటిల శిఖాజటాశ్చ [గౌ- 1,2]

30 సూ. మాటచే నెదురాడక గురువునకు హితము చేయ వలయును. [అప, 1,2,19]

31 సూ. బ్రాహ్మణునికి ముంజగడ్డి త్రాడు, క్షత్రియునికి వింటినారి, వైశ్యునికి దారముల త్రాడు మొలత్రాళ్లుగా నుండ వలయును. [బో, 1,2,14]

32 సూ. బ్రాహ్మణుడు లేడి చర్మమును, క్షత్రియుఁడు దుప్పి చర్మమును, వైశ్యుఁడు మేక చర్మమును దాల్చవలయు [బో, 1,2,15]

వివ: చర్మమునుపైని ధరింపవలయునని ఆపస్తంబఋషి

33 సూ. నూలు, పట్టు, అవిసి నార, బొచ్చులతోఁ జేయఁ బడిన వస్త్రము లందఱు దరింపవచ్చును. [గౌ, 1,19]

34 సూ. రంగు పూయని దూది బట్టయైనను అందఱు ధరింపవచ్చును.

సూ. జేగురు రంగుబట్టనుగూడ ధరింపవచ్చునని కొందఱు

సూ బ్రాహ్మణుఁడు నారబట్ట ధరింపవలయును

సూ. క్షత్రియుఁడును, నారింజవర్ణపు బట్టను, వైశ్యుఁడు పసుపు రంగు బట్టను ధరింపవలయును

35 సూ. మారేడు మోదుగు కఱ్ఱలు బ్రాహ్మణునికి దం ములు, అశ్వస్థపైలవ దండములు క్షత్రియ వైశ్యులు ధరిం నగు [గౌ 1,24,25]

సూ- యజ్ఞమున పనికినచ్చు దండములైన నందఱకును పనికివచ్చును [గౌ, 1, 26]

37 సూ- జుట్టు పూర్తిగా తీసివేయుటగాని, శిఖనుగాని జడలను గాని అందఱు ధరింపవచ్చు [గౌ 1,27]

38 సూ- ప్రాణోపస్పర్శనం దర్భైః [గౌ 1-54]

39 సూ- ప్రాణాయామాస్త్రయః పంచదశమాత్రాః
[గౌ- 1-55]

40 సూ- ఓం పూర్వా వ్యాహృతయః పంచసత్యాంతాః
[గౌ- 1-57]

వివ:- శ్లో॥ ఆయుః సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరాహృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః
కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్షవిదాహినః
ఆహారారాజసస్యేష్టా దుఃఖశోకామయ ప్రదాః
యాతయామం గతరసంపూతి పర్యుషితంచ యత్

ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియం
[గీత, 17,8,9,10]

ఏతేన సత్త్వాహారాః బ్రాహ్మణాః రాజసాహారా క్షత్రియ వైశ్యాః, తామసాహారాః శూద్రాభవంతి ఇతిభావః

41 సూ, గురోః పాదోపసంగ్రహణం ప్రాతః [గౌ, 1,58]

42 సూ, బ్రహ్మమవచనే చాద్యంతయోః [గౌ, 1,59]

43 సూ, అనుజ్ఞాత ఉపవిశే త్ప్రాఙ్ముఖో, దక్షిణతః శిష్య ఉదఙ్ముఖోవా [గౌ, 1,60]

44 సూ, సావిత్రీ చానువచనమాదితో బ్రహ్మణ ఆదానే
[గౌ, 1,61]

38 సూ. దర్భలచే నింద్రియములను స్పృశింపవల యును. (గౌ, 1,54)

39 సూ. పదునేను మాత్రలు గల మూఁడు ప్రాణాయా మములు చేయవలయును. (గౌ, 55)

40 సూ ఓమ్ మొదలు కొని సత్యం అనునంతవఱకు అయిదు వ్యాహృతులను బలుక వలయును. (గౌ 1,48)

వివ:- ఆయుర్వృద్ధి బలారోగ్య,ప్రీతిదంబౌ, రసాఢ్యమౌ చమురౌ పుష్టియౌ, నింపౌ, నన్నంబుల్ సాత్త్వికంబులు.

వివ: ప్రీతిదంబు=ప్రీతినిచ్చునవి.

ఉప్పఁ, గార, మతివేఁడి, పుల్ప, వెండువి, చేఁదువి దప్పిన్ వ్యాధిన్, వ్యథల్ గూర్చు, నన్నంబుల్ రాజసంబులు చల్లఁబడ్డ రుచిపోవు, దుర్గంధి యైన, రాత్రి దౌ ఎంగిలౌ నపవిత్రంబౌ, నన్నంబుల్ తామసంబులు.

వివ: దీనినిబట్టి బ్రాహ్మణులు సత్త్వాహారులుగాను క్షత్త్రియులు వైశ్యులు రాజసాహారులుగాను, శూద్రులు తామసాహారులు గాను ఉందురని భావము.

41 సూ, ప్రాతఃకాలమున గురుపాదములకు నమస్కరిం పవలయును (గౌ, 1,58)

42 సూ, వేదపాఠ సమయమున మొదటను జివరను బ్రహ్మను వచనము పలుకవలయు (గౌ, 1,59)

43 సూ, గురువు ననుజ్ఞపొంది తూర్పుమొగముగాఁ గాని ఉత్తర ముఖముగాఁగాని గురువునకు దక్షిణమునఁ గూర్చుం డవలె (గౌ, 1,60)

44 సూ, వేదమును గ్రహించునపుడు సావిత్రిని మొదటఁ బలుక వలయు (గౌ, 1,61)

45 సూ, ఓంకారోఽన్యత్రాపి (గౌ, 1,62)

46 సూ, ప్రాగుపనయనాత్కామచార వాద భక్షః (గౌ, 2,1)

47 సూ ఉపనయనాది ర్నియమః (గౌ, 1,20)

48 సూ అధశ్శయ్యాసనీ పూర్వోత్థాయ జఘన్య సంవేశీ, (గౌ, 2,27)

49 సూ, నానుదేశ్యం భుంజీత, (అప, 1,2,22)

50 సూ, తథాక్షార లవణ మధుమాంసాని (అప, 1,2,23)

51 సూ వర్జయేన్మధు, మాంస, గంధ, మాల్య, దివాస్వాపాంజ, నాభ్యంగ, నోపాన, చ్ఛత్రి, కామ, క్రోధ, లోభ, వాదవాదన, స్నాన, దంతాధావన, హర్ష, నృత్త, గీత, పరివాద భయాని (గౌ- 2-29)

శ్లో॥ వీణావవాన తత్త్వజ్ఞః శ్రుతి జాతి విశారదః
తాలజ్ఞశ్చాఽప్రయాసేన మోక్షమార్గం నిగచ్ఛతి
(యా- 3-115)

వివ: బదరికాశ్రమవర్ణనే "నృత్యగీతైరలంకృతం" ఇత్యత్రిమాధవాచార్యేణోదా హృతం "ఎతద పిభగవత్ప్రీత్యర్థ మేవానుష్ఠి"తంచేత్ మోక్షసాధకం అన్యత్రతు బంధహేతురేవ ఇతి చ టిప్పణ్యాం

45 సూ ఇతరస్థలములందును ఓంకారము పలుకవలయు (గౌ- 1-62)

46 సూ- ఉపనయమునకుఁబూర్వము స్వేచ్ఛగా తిరుగుచు పలుకుచుఁ దినుచు నుండవచ్చును. (గౌ- 2-1)

47 సూ ఉపనయనము మొదలుకొని నియమముగా నుండ వలయును (గౌ- 2-1)

48 సూ- క్రిందఁబరుండి కూర్చుండి గురువునకు ముందుగలేచి, గురువు పరుండిన పిదపఁ బరుండవలయు (గౌ- 2-27)

49 సూ- గురువునకుఁ తెలుపకుండ నేదియు దినరాదు- (ఆప- 2-22)

50 సూ- అట్లే కారము ఉప్పు తేనె మాంసములను దినరాదు [ఆప- 1-2-23]

51 సూ- తేనె మాంసము పరిమళగంధములు మాలలు పగటినిద్ర కాటుక అభ్యంగనము చెప్పులు గొడుగు కోరిక కోపము ఆశ వాదము మృదంగాది వాద్యములు భోగార్థమైన స్నానము పరిమళవస్తువులచే దంతధావనము సుఖము ఆట నృత్యము పాటలు గీతము పరదోషకథనము పరులను భయపెట్టుట వీనిని త్యజింపవలెను-

వివ: విలాసార్థముగానివి యిందు నిషిద్ధములుగావు.

వీణావాదనతత్త్వజ్ఞుఁడును శ్రుతులందు స్వరజాతులందును నేర్పుగలవాఁడును తాలవేత్తయును అనాయాసముగా మోక్షమును పొందును (యాజ్ఞ 3-115)

వివ: బదరికాశ్రమవర్ణనలో "నృత్యగీతములచే అలంకరింపబడును అనుచోట మాధవాచార్యుఁడిట్లనెను అదియును భగవత్ప్రాప్తి కొఱకు చేసిననే మోక్షమిచ్చును- కానిచో బంధకారణమే అని టిప్పణిలో

52 సూ మధుమాంసాంజనోచ్ఛిష్టశుక్తస్త్రీ ప్రాణిహింసనం భాస్కరాలోకనాశ్లీల పరివాదాంశ్చ వర్జయేత్
[యజ్ఞవల్క్య-ఆచార 33]

53 సూ నిష్ఠీవిత హసిత విజృంభి తావస్ఫోటనాని
[గౌ- 2-21]

54 సూ యావదర్థ సంభాషీ స్త్రీభిః [బో- 1-2-24]

55 సూ సభాః సమాజాంశ్చాఽగంతా (అప 1-2-24)

56 సూ సత్యవాదీ హ్రీమా నవహంకారః [బో 1-2-21]

57 ద్యూతం హీనసేవా మదత్తాదానం హింసాం
[గౌ- 2-23]

58 సూ మద్యం నిత్యం బ్రాహ్మణః [గౌ- 2-26]

వివ: మద్యం=మదకరం

59 సూ వాగ్బాహూదరసంయతః [గౌ- 2-28]

60 సూ అగ్నీం ధనభైక్షచరణే [గౌ- 1-12]

61- సూ సంయతవాక్చతుర్థ షష్ఠాష్టమకాల భోజీ భైక్ష మాచరేత [వసి- 7-2]

62 సూ- భవత్పూర్వయా బ్రాహ్మణోభిక్షేత
(అప- 1-2-29)

52 సూ. తేనె, మాంసము, కాటుక, ఎంగిలి, నిష్ఠురవాక్కు స్త్రీ దర్శనాదులు ప్రాణిహింస, సూర్యునిజూచుట, అశ్లీల భాషణములను పలుకుట, వినుట, పరదోషములను త్యజింపవలయు.
(యాజ్ఞవల్క్య, ఆచార 33)

53 సూ. ఉమ్మివేయుట, నవ్వుట, ఆవులింత, ఒళ్లువిఱుచుటను, విడువవలయును. (గౌ. 2,21)

54 సూ. అవసరమైనంతవఱకె స్త్రీలతో మాటాడవలయు [బో, 1,2,24]

55 సూ సభలకు సమాజములకుఁబోవలాదు (ఆప,1,2,12)

56 సూ. సత్యము, సిగ్గుగలవాడై యహంకారము లేక యుండవలెను. (బో. 1,221)

57 సూ జూదమును, నీచసేవను, ఇయ్యకుండఁ బుచ్చుకొనుటను, హింసను వదలవలయు. (గౌ, 2,23)

58 సూ. బ్రహ్మను దెలియగోరుఁవాడు మత్తుగలిగించు పదార్థములను విడువవలయును. (గౌ, 2,26)

59 సూ. వాక్కును, బాహువులను, ఉదరమును నియమించుకొనవలయును, (గౌ, 2,26)

60 సూ. అగ్నిని హోమము చేయుట భిక్షయును చేయవలయు (గౌ, 2,12)

61 సూ. వాక్కును నియమంచుకొని దినమందు నాల్గయాఱవ, ఎనిమిదవ భాగ కాలమందు భుజించువాఁడై యుండవలయు (వసి, 6,5)

62 "భవతి భిక్షాందేహి" "అమ్మా, పూజ్యురాలా! పెట్టుము" అని బ్రాహ్మణుఁడు భిక్ష మడుగ వలయు [ఆప, 1,2,29]

63 సూ. భవన్మధ్యయారాజన్యః [అవ, 1,2,30]

64 సూ భవదంత్యయావైశ్యః [అవ, 1_3_31]

65 సూ తత్సమాహృత్యోపనిధాయ ఆచార్యాయ ప్రబ్రూయాత్ [అవ, 1,3,32]

66 సూ. తేవ ప్రదిష్టంభుంజీత [అవ, 1,3,33]

67 సూ. వివ్రవాసే గురో, రాచార్యకులాయ (అవ, 1,3,34)

68 సూ నాప్న ప్రయోజనశ్చరేత్ (అప 1,3,35)

సూ. సర్వంలాభమాహరన్ గురవే సాయంప్రాతరమంత్రేణ భిక్షాచర్యంచరేద్భిక్షమాణోఽన్యత్రాఽపపాత్రేభ్యోఽభిశస్తాచ్చ [అవ. 1, ప్ర,కం, 3,25 సూ]

69. సూ. సార్వవర్ణికం భైక్షచరణమభిస్త పతిత వర్జం. (గౌ, 42)

వివ:_ అభిశస్తః-స్తేన: బ్రహ్మహంతక, మనుజహంతక, వేదనాశక గర్భనాశక: మాతృపితృసంబంధి స్త్రీగంతా సురాపాయి, పంయోనర్హ సంయోగ గుర్వాదిసఖీగంతా;వరదాగఃఅధర్మచారి

70 సూ ఆచార, జ్ఞాతి గురుస్వేష్వలాభేఽన్యత్ర [గౌ,2,44]

63 సూ "భిక్షాం భవతి దేహి" యని క్షత్రియుఁ డడుగ వలయును. [అప. 1,3,30]

వివ; "భిక్ష పూజ్యురాలా! పెట్టుము'

64 సూ 'భిక్షాం దేహి భవతి' యని వైశ్యుఁడడుగవలయు

వివ; 'భిక్షను పెట్టుమమ్మా" [అప, 1-3,30]

65 సూ. భిక్ష తెచ్చి యుంచి యాచార్యునికిఁ తెలుప వలయును. [అప, 1,3,33]

66 సూ. ఆచార్యునిచే నీయబడిన దానిని దినవలయు. (అప, 1,3,33)

67 సూ. గురువూరిలో లేనప్పుడు ఆచార్య కులములకుఁ జెప్పవలయు. [అ, 1-3-34]

68 సూ. తన ప్రయోజనమునకు మాత్రమే చరింపరాదు [అప, 1,3,35]

గురువునకుపయోగకరమైన పనిచేయుచు సాయంకాలము పొద్దున్న అపపాత్రులను అభిశస్తులను విడిచి యితర మగు చోట భిక్షా చర్యము చేయువలయును.

69 సూ. అభిశస్తులను పతితులను విడిచి యన్నివర్ణము లందు భిక్షను జరింపవచ్చును. [గౌ- 2-42]

వివ; అభిశస్తులు దొంగ, బ్రహ్మహంతుడు మనుజహంత కుఁడు వేదనాశకుడు మాతాపితృసంబంధిస్త్రీతోఁ గలియువాఁడ మద్యముత్రాగువాఁడు కలియ రాని వారితోఁ గలియు వాఁడ గుర్వాది స్త్రీ గంత, పరస్త్రీ గంత అధర్మాచారి.

70 సూ. ఇతరమగుచోట్ల దొరకనిచో ఆచార్యుని యింట, జ్ఞాతుల యింట గురుపునింట తన యింట గ్రహింపవగు [గౌ- 2-44]

71 సూ భుక్త్వా స్వయముమంత్రిం ప్రక్షాళయీత
(అప, 1,3,36)

72 సూ. స్త్రీణాం ప్రత్యాచక్షాణాం సమాహితో బ్రహ్మచారి ఇష్టం దత్తం హృతం ప్రజాం పశూన్ బ్రహ్మవర్చసమన్నాద్యం వృంక్తే తస్మాదు హవై బ్రహ్మచారిసంఘం చరతం నప్రత్యాచక్షాతాపి హైష్వేవంవిధ ఏవంవ్రతః స్యాదితిహి బ్రాహ్మణం
[అప, 1,3,26]

73 సూ. సదాఽరణ్యాత్సమిధ అహృత్యాదధ్యాత్
[బో, 1-2-20]

74 సూ. నాస్తమితేసమిద్ధారో గచ్ఛేత్ [అప 1_4_15]

75 సూ. అగ్నిమిధ్వా పరిసమూహ్య సమిధ ఆదధ్యాత్సాయం ప్రాతర్యథోపదేశం [అప, 1_4-16]

76 సూ సాయంప్రాతరుదకుంభ మాహరేత్(అప_1_1-13)

77 సూ. ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖోవా శౌచమారభేత
[గౌ, 1,60]

78 సూ, శుచౌదేశ ఆసీనోదక్షిణం బాహుంజాన్వంతరా కృత్వా యజ్ఞోపవీత్యా మణీ బంధాత్పాణీ ప్రక్షాళ్యవాగ్యతో హృదయస్పృశస్త్రిశ్చతుర్వాఽప ఆచామేత్ (గౌ- 1-36)

79 సూ- అథాహరహరాచార్యం గోపాయేద్ధర్మార్థయుక్తైః కర్మభిః (అప- 1_4-23)

71 సూ. భుజించి స్వయముగాఁ బాత్రి కడుగుకొన వల వలయు. [అప. 1. 3. 36]

72 సూ. స్త్రీలు భిక్ష పెట్టక పొమ్మన్నచో సమాహితుఁడైన బ్రహ్మచారి, వారి యాగాదులను, దానమును, హోమమును, సంతానమును, పశువులను, బ్రహ్మవర్చస్సును, అన్నాదులను, పోఁగొట్టును గావునఁ జరించుచున్న బ్రహ్మచారిసంఘమును భిక్ష పెట్టక పొమ్మనరాదు. మఱియు నిట్టివాని విషయమై ఇట్లే ప్రవర్తింప వలయునని బ్రాహ్మణము చెప్పుచున్నది. [అప. 1, 3, 29]

73 సూ. ఎల్లప్పుడు అరణ్యమునుండి సమిధలను దెచ్చియుంచవలయు [బో. 1, 2, 20]

74 సూ, సూర్యుఁడస్తమింపఁగా సమిధలకై పోవరాదు. [అప, 1. 4, 14]

75 సూ. అగ్నిని మండింపఁ జేసి పరిసమూహనముచేసి సాయంకాలము ఉదయము ఉపదేశము ప్రకారము సమిధలుంచ వలయు.

76 సాయంకాలము ప్రొద్దట గురువునకు నీరుతేవలయును. [ఆ, 1, 1, 13]

77 సూ. తూర్పు మొగమైగాని యుత్తరపు మొగమైగాని శౌచకర్మను అరంభింపవలయును. [గౌ. 1, 37]

78 సూ. పరిశుద్ధమైన చోటఁ గూర్చుండి కుడి చేతిని మోకాళ్ళ మధ్యనుంచి యజ్ఞోప వీతము పట్టుకొని మణిబంధము వఱకు చేతులు కడుగుకొని వాక్కును నియమించి హృదయమును దాకునట్లు నీళ్ళు మూడు సార్లుగాని, నాలుగు సార్లుగాని ఆచమనము చేయవలెను. [గౌ. 1, 38, ]

79 సూ. మఱి ప్రతిదినము ధర్మార్థ యుక్తములైన కర్మలతో నాచార్యుని రక్షింపవలయును. [అప. 1, 4, 27]

80 సూ. దక్షిణం దక్షిణేన సవ్యం సవ్యేన చోపసంగృహ్ణీయాద్దీర్ఘమాయుః స్వర్గం చేచ్ఛన్ [బో, 1, 2, 26]

81. సూ. అసావహంభో ఇతి శ్రోత్రేసంస్పృశ్య మనస్సమా ధానార్థం [బో, 1, 2, 27]

82 సూ. అథస్త్రాజ్ఞాన్యోరాపద్యాభ్యం [బో. 1. 2. 28]

83 సూ. కామమన్యస్మై సాధువృత్తాయ గురుణాఽమజ్ఞాతః [బో. 1. 2 30]

84 సూ. శక్తివిషయే ముహూర్త మపివాన్ ప్రయుతస్స్యాత్. (బో. 1. 2. 31)

85 సూ. సమిద్ధార్యుదకుంభ పుష్పాన్నహస్తో నాభి వాదయేద్యచ్చాన్యదపి యేవంయుక్తం (బో 1. 32.)

86 సూ. నసోపాన ద్వేష్టితశిరా అవహితపాణిర్వాభి వాదయీత [ఆప 4. 14. 19]

87 సూ. భ్రాతృపత్నీనాం యువతీనాం గురుపత్నీనాం జాత వీర్యః [బో. 1. 2. 34]

88 సూ. నౌ. శిలాఫలక, కుంజర, ప్రాసాద, కటకేషు చక్రివత్సు, చాదోషం సహాసనం- [బో. 1. .. ..]

89 సూ. ప్రమాదాదాచార్యస్య. బుద్ధిపూర్వం వా నియమా తిక్రమంరహసిబోధయేత్. [ఆప. 1. 4. 25]

80 సూ. కుడికాలు కుడిచేతితోను, ఎడమ కాలు ఎడమ చేతితోను బట్టుకొని, శిర్సాయుపును సర్గమును గోరువాఁడై గురుపునకు నమస్కరింప వలయును. [బో, 1, 2, 26 ]

81 సూ. మనస్సు సమాధానము కొఱకు చెవులు పట్టుకొని "నేను ఫలానా వాఁడను అయ్యా" అని నమస్కరింప వలయు. [బో. 1. 2. 27]

82 సూ. మోకాళ్ళకుఁ గ్రిందఁ బాదములవఱకు నమస్కరింపవలయు. [బో. 1. 2. 28]

83 సూ. గురువు సమ్మతిపొంది సాధువర్తనముగల యితరునకు నమస్కరింపవలయు. [. 1. 2. 30]

84 సూ. చేయఁగలిగి యున్నపుడు ఒక క్షణము గూడ అశ్రద్ధతో నుండరాదు. [బో. 1. 2. 3]

85 సూ. సమిధలు, నీటి బిందె, పువ్వులు, అన్నము ధరించి యున్నపుడు నమస్కరించరాదు ఇట్లె మిగిలినపుడును [బో. 1. 2. 3]

87 సూ. చెప్పులతో. తలపాగతో దర్భలతో నున్నప్పుడును నమస్కరింపరాదు. (ఆప. 4. 14. 19)

87. సూ. యువకుఁడయిన వాఁడు అన్నల భార్యలకు. యువతులకు. గురు భార్యలకు నమస్కరింపరాదు. (బో. 1. 2. 34)

88 సూ. నావలందు. శిలాఫలకములందు. ఏనుఁగు మీఁద. మేడలపైని, కొండచఱియలందు, చక్రములు గల వాహనములందుఁ గలిసి కూర్చుండుట దోషముగాదు. [బో. 1. 2. 35]

89. సూ. పొరపాటు వల్లఁగాని బుద్ధిపూర్వకముగా ఆచార్యుఁడు నియమము నతిక్రమించినచో రహస్యముగాఁ దెలుప వలయును. [ఆప. 1. 4. 25]

90 సూ. అనివృత్తౌ స్వయంకర్మాణ్యారభేత
[అప. 1. 4. 26]

91. సూ. నివర్తయే ద్వా [అప. 1. 1. 27]

92. సూ. శుశ్రూషాన్ముప్రజ్యాచయావదధ్యయనం.
[బో. 1. 2. 43]

94. సూ. యుత్వ, శ్వశుర, పితృవ్య, మతులానాంతు
య వీయసాం ప్రత్యుత్థాయాభీభాషణం. [బో. 1, 2, 46]

95. సూ. ధర్మార్థౌ యత్ర నస్యాతాంశుశ్రూషాపి తద్విదా
విద్యయా సహమర్తవ్యం నష్టైనామూషరే వపేత్
[బో. 1. 2. 49]

96. సూ. అహూతాధ్యాయీ [అప 1. 5. 28]

97. సూ. అహోరాత్రయోః సంధ్యయోః పర్వసు చ వా
అధీయాత. [బో. 1. 11. 34]

వివ:- అహస్సంధ్యాయాం. రాత్రిపకధ్యాయాం చ నాధీయీ
త్యర్థః

98. సూ. శ్మశాన, గ్రామాంత, మహాపథాశౌచేషు.
(గౌ, 0, 18)

99, సూ. శుక్తకే చోద్గారే (గౌ, 16. 20)

100, సూ. వర్షతి చ [గౌ 16, 13]

90 సూ. గురువు తప్పునుండి మరలనిచో తానే కర్మలు చేయవలయు (అవ, 1,4,26)

91 సూ. బలాత్కారముగఁ దానుగాని పితాదులద్వారా గాని ఆ దోషమునుండి మరలింపఁ జేయవలయు.(అవ,1,1,27)

92 సూ. ఆపత్కాలమున ఆ బ్రాహ్మణుని యొద్దఁ జదువ వచ్చును. (బో, 1,2,42)

93 సూ. చదువు ముగించు వఱకు శుశ్రూషయు అనుస రించుటయు జేయవలయు (బో, 1,2,43)

94 సూ. తనకంటెఁజిన్నవారగు ఋత్విక్కులకు, మామ లకు, పినతండ్రులకు, మేనమామలకు ఎదురుగ వెళ్లి మాటాడ వలయు (బో, 1_2_46)

95 సూ. ఎవని దగ్గఱ ధర్మార్థము లుండవో, శుశ్రూషా భావము లేదో, వానికివిద్య చెప్పరాదు, చవిటి పఱ్ఱ యందు ఈ విద్యను నాటరాదు. (బో, 1-2_49)

96 సూ. గురువుచే బిలువఁబడి చదువ వలయు (అవ- 1_5_26)

97 సూ_ పగటి పంధ్యను రాత్రి సంధ్యను, వర్షము లంపును జదువరాదు [బో- 1_11_34]

98 సూ_ శ్మశానమున, గ్రామము చివర, రాజమార్గమున అశుచిస్థానమునఁ జదువరాదు_ [గౌ_16-18]

99 సూ- పులిత్రేన్పు వచ్చినప్పుడును జదువరాదు [గౌ- 16-20

100 సూ_ వర్షము కురయుచుండగా జదువరాదు [గౌ- 12-13]

183. సూ. సంతోషం పరమాస్థాయ సుఖార్థీ సంయతో భవేత్ సంతోషమూలం హి సుఖం దుఃఖమూలం విపర్యయః
[మను. 4_1?]

184 సూ. ఇష్టం పూర్తం చ ప్రకర్తవ్యం బ్రాహ్మణేన ప్రయత్నతః ఇష్టేనలభతేస్వర్గంపూర్తేన మోక్షమాప్నుయాత్
(అత్రి 45)

185 సూ. అగ్నిహోత్రం తపః సత్యంవేదానాం చైవపాలనం అతిథ్యం వైశ్వ దేవశ్చ ఇష్టమిత్యభిధీయతే. (అత్రి 43)

186 సూ. వాపీ కూప తడాగాది దేవతాయతనాని చ అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయతే. [అత్రి 44]

187 సూ. ఇష్టాపూర్తౌ ద్విజాతీనాం సామాన్యౌ ధర్మసాధనే అధికారీ భవేచ్ఛూద్రః పూర్తే ధర్మే న వైదికే. [అత్రి 46]

188 సూ. యమాన్సేవేత సతతం న నిత్యం నియమాన్ బుధః యమాన్ పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్.
[అత్రి 45]

189 సూ. అనృశంస్యం క్షమా సత్య మహింసాదాన మార్జవం ప్రీతిః ప్రసాదోమాధుర్యం మార్దవంచ యమాదశ
(అత్రి 48)

190 సూ. శౌచమిజ్యా, తపః స్వాధ్యా, యోపస్థనిగ్రహః వ్రతమౌ నోపవాసాశ్చ స్నానంచ నియమా దశ. [అత్రి. ?]

183 సూ సుఖముగోరి నియమము గలవాఁడై సంతృప్తి పొంది యుండవలయును. సుఖము సంతృప్తి మూలకము అసంతృప్తి మూలకము దుఃఖము. [మను. 4-12]

184 సూ. బ్రాహ్మణుఁడు ప్రయత్నించి యిష్టమును పూర్తమును చేయవలయు ఇష్టముచే స్వర్గము, పూర్తముచే మోక్షమును పొందును. [అత్రి సంహిత 4_5]

185 అగ్నిహోత్రము, తపస్సు, సత్యము, వేదపాలనము అతిథి సత్కారము, వైశ్వదేవము నివియిష్టములనబడు [అత్రి 43

186 సూ. దిగుడుబావి, నూయి, చెఱువు మొదలైనవియు గుడులు, అన్నదానము, తోట యివిపూర్తములనబడు [అత్రి.44

186 సూ. ద్విజులకు ఇష్టాపూర్తములు రెండు ధర్మసాధనములు, శూద్రునికి పూర్తమందెగాని వైదిక ధర్మమందు అధికారము లేదు. [అత్రి 46]

188 సూ. ప్రతినిముషమును బుధుఁడు నియమములను సేవింపవలెను. నియమములను ప్రతి నిముషమును సేవింపనక్కరలేదు. నియమములను ఆచరింపక కేవల నియమముల నాచరించు వాఁడు పతితుఁడగును. [అత్రి 47]

189 సూ. అక్రూరత, ఓర్పు, సత్యము, అహింస, దానము ఋజుత్వము, ప్రీతి, ప్రసన్నత, మాధుర్యము, మృదుత్వము ఈ పది యమములు. [అత్రి 8]

190 సూ. శౌచము, యజ్ఞము, తపస్సు, స్వాధ్యాయము బ్రహ్మచర్యము, వ్రతములు, మౌనము, ఉపవాసములు, స్నానము ఈ పది నియమములు. [అత్రి 45]

అథస్త్రీధర్మాః

సూ॰ ద్వివిధాః స్త్రియః బ్రహ్మవాదిన్యః సద్యోవధ్వశ్చ తత్రబ్రహ్మవాదినీనా ముపనయనమగ్నీంధనం వేదాధ్యయనం స్వగృహేచ భిక్షాచర్యాఇతి. సద్యో వధూనాంతూపస్థితే వివాహే కథంచి దుపనయనమాత్రం కృత్వావివాహః కార్యః [హారీతః]

పురాకల్పే కుమారీణాం మౌంజీ బంధనమిష్యతే
అధ్యాపనంచవేదానాం సావిత్రీ వాచనంతథా[యమః]

191 సూ. అమంత్రికాతుకార్యేయం స్త్రీణామావృదశేషతః సంస్కారార్థం శరీరస్య యథాకాలం యథాక్రమం [మను2,9.

192 సూ. వైవాహికోవిధిస్త్రీణాం సంస్కారో వైదికఃస్మృతః పతిసేవాగురౌ వాసోగృహార్థోఽగ్ని పరిక్రియా. [మను. 2,97]

193 సూ. భర్తృహితే యతమానా స్స్వర్గంలోకం జయేత్ [బో॰ 2-2-48]

194 సూ. యత్రనార్యస్తు పూజ్యంతేరమంతే తత్రదేవతా యత్రైతాస్తునపూజ్యంతేసర్వాస్తత్రాఫలాఃక్రియాః(మను3,5

195 సూ- సంతుష్టోభార్యయా భర్తాభర్త్రాభార్యాతథైవచ యస్మిన్నేవకులేనిత్యం కళ్యాణంతత్ర వైధ్రువం[మను, 3,60]

మఱి యింక స్త్రీ ధర్మములు

సూ. స్త్రీలు బ్రహ్మ వాదినులు, సద్యోవధువులు అని రెండు రకములుగా నుందురు. అందు బ్రహ్మ వాదినులకు ఉపనయనము అగ్ని కార్యము, వేదాధ్యయనము స్వగృహమున భిక్ష యగును. ఇంక సద్యోవధువులకు వివాహ కాలము రాఁగా ఏదో విధముగా ఉపనయనము చేసి వివాహము చేయఁదగును
(హారీతుఁడు)

సూ. పూర్వ యుగములో కుమార్తెలకు ఉపనయనము (మౌంజికట్టుట, వేదాధ్యయనము, సావిత్రీ మంత్రవాచనము సమ్మతము (యముడు)

191 సూ. స్త్రీలకు జాతకర్మాదికమును మంత్రరహితముగా వరుసగా యథా కాలమునఁ బూర్తిగాఁ జేయవలయును.
(మను, 2_66)

192 సూ. స్త్రీలకు వివాహ విధియే వైదిక సంస్కారమగు నుపనయనము, పతి సేవయే గురుకుల వాస వేదాధ్యయనము గృహకృత్యమే యగ్ని పరిచర్య.

193 సూ. భర్తకు హితము గూర్చు స్త్రీలు స్వర్గలోకమును జయింతురు. (బో. 2,2,48)

194 సూ. స్త్రీలు పూజింపఁబడుచోట దేవతలుందురు. స్త్రీలు పూజింపఁబడనిచోట సర్వక్రియలు నిష్ఫలము. (మను. 3,5,6)

95 సూ భార్యచే సంతోషము పొందు భర్తయు భర్తచే సంతోషము పొందు భార్యయుఁగల కులమున నిత్యము ధ్రువముగ కళ్యాణము గలుగును. (మను. 3,20

196 సూ. నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో నవ్రతం నాప్యుపోష ణం పతిం శుశ్రూషతేయేన్ల తేనస్వర్గేమహీయతే(మను. 3,1,55)

197 సూ. మృతేభర్తరిసాధ్వీస్త్రీ బ్రహ్మచర్యే వ్యవస్థితా స్వర్గంగచ్ఛత్య పుత్రాపి యథాతే బ్రహ్మచారిణః(మను5_160)

198 సూ. ఏవం పురుషోఽపీతిఅధునికాః

ఇతి స్త్రీ ధర్మాః

199 సూ. అథాతస్సంధ్యోపాసన విధిం వ్యాఖ్యాస్యామః (బో. 2_2_1)

200 సూ. బ్రాహ్మేముహూర్తే బుధ్యేత ధర్మార్థౌచానుచిం తయేత్ కాయక్లేశాంశ్చ తన్మూలాన్వేదార్థతత్త్వమేవచ (మను. 4_92)

ఉత్థాయోత్థాయబోద్ధవ్యం కిమద్యసుకృతం కృతం
దత్తందాపితం వాపి వాక్సత్యా వాపిభాషితా (విష్ణు)

201 సూ. తీర్థంగత్వాఽప్రయతోఽభిషిక్తః ప్రయతోనాఽ నభిషిక్తః ప్రక్షాళితపాదపాణి రప అచమ్య సురభిమత్యాఽబ్లింగా భిర్వారుణీభిర్హిరణ్యవర్ణాభిః పావమానీభి ర్వ్యాహృతిభి రన్యైశ్చ పవిత్రైరాత్మానంప్రోక్ష్య ప్రయతోభవతి (బో. 2_4_2)

202 సూ. సాయంప్రాతర్భగవద్భావనాపి సంధ్యోపా సన త్వత్యేతిగాంధీ

196 సూ. స్త్రీలకు వేఱుగ యజ్ఞముగాని, వ్రతముగాని యుపవాసముగాని లేదు పతిశుశ్రూష వల్ల స్వర్గము సిద్ధించును (మను. 3-155)

197 సూ. భర్త చనిపోఁగా సాధ్వియైన స్త్రీ, బ్రహ్మచర్యమునందున్న చో బ్రహ్మచారి వలె పుత్రులు లేకున్నను స్వర్గము పొందును (మను, 5-160)

198 సూ. పురుషుఁడుగూడ భార్యపోయినచో బ్రహ్మచారియై పుత్రులు లేకున్నను స్వర్గమును పొందునని ఆధునికులు

199 సూ. మఱియింక సంధ్యోపాసన విధిని వ్యాఖ్యానింతుము. (బో. 2-4-1)

200 సూ. బ్రాహ్మముహూర్తమునధర్మార్థములను కాయకష్టములను, వేదార్థతత్త్వమునుధ్యానించుచు మేల్కొనవలయు (మను. 492)

సూ. లేచిలేచి ఈ రోజున నేనేమి సుకృతము చేసితిని ఏమి దానము చేసితిని ఇప్పించితిని, ఏమిసత్యవాక్కు పలికితిని అని తెలిసికొనఁ దగును.

201 సూ. నద్యాది తీర్థములకుఁబోయి యపరిశుద్ధుడైనః స్నానము చేసిగాని పరిశుద్ధుడైనచో స్నానము చేయక గాని కాళ్ళు చేతులు కడుగుకొని నీరు ఆచమించి "దధిక్రావ్ణః" అను ఋక్కుచేతను, జల వరుణ పవమాన దేవతాక మగు ఋక్కుల చేతను 'హిరణ్యవర్ణా' అను ఋక్కులచేతను వ్యాహృతులచేతను ఇతరములగు పవిత్ర సూత్రములచేత తన్నుఁ జల్లుకొనినచో పవిత్రుఁడగును. (బో. 2-4-2)

202 సూ. సాయంకాలము పొద్దుట భగవంతుని ప్రార్థన గూడ సంధ్యోపాసన తుల్యమైనదని గాంధి మహాత్ముఁడు.

203 సూ. దర్భేష్వాసీనో దర్భాన్ ధారయమాణ స్సోదకేనపాణి నా ప్రత్యఙ్ముఖస్సావిత్రీం సహస్రకృత్వ ఆవర్తయేత్ (బో. 2-4-5)

204 సూ. ప్రాణాయామశోవా శతకృత్వః (బో. 2-4-6)

205 సూ. ఉభయతః ప్రణవాం ససప్తవ్యాహృతికాం మనసావా దశకృత్వః (బో. 2-4-6)

వివ:- ఓం భూః ఓం భువః, ఓం సువహః, ఓంమహః, ఓంజనః ఓం తపః, ఓం సత్యం ఇతి సప్తవ్యాహృతయః

206 సూ. త్రిభిశ్చ ప్రాణాయామైస్తాంతో బ్రహ్మహృదయేన (బో. 2-4-8)

వివ:- సవ్యాహృతిం. ప్రణవాం గాయత్రీం శిరసాసహ
త్రిః పఠేదాయత ప్రాణః ప్రాణాయామస్స ఉచ్యతే

'వామనా సాపుటేనైనపూర యేత్పూరకస్స్మృతః కుంభకో నిశ్చల శ్వాసస్తా వత్కాలం సమంత్రకం దక్షిణసాపుటేనైనరేచయేద్రేచక. స్మతః' పూరక కాలః 16 మాత్రాణాం కాలః కుంభక కాలః 64 మాత్రాః. రేచక కాలః 32 మాత్రాః మాత్రాచ నేత్రనిమీల్య ఉన్మీలన పర్యంత కాలః

207 సూ. సుపూర్వా మపిపూర్వోపక్రమ్యాదినామఆదిత్యే సమాప్నుయాత్ (బో. 2-4-12)

వివ:- సుపూర్వాం=నక్షత్రేషు దృశ్యమానేషు పూర్వాం సంధ్యాము పక్రమ్య ఆదితోనత్త రకాలే సమాప్నుయాత్

208 సూ. అనస్తమిత ఉపక్రమ్యసుపశ్చాదపి పశ్చిమాం (బో. 2-4-13)

209 సూ. సంధ్యయోశ్చ సంపత్తా వహోరాత్రయోః సంపత్తిః (బో. 2-4-14)

వివ:-అహోరాత్రయోః సంపత్తిః=అయుషోఽ విచ్ఛిత్తిః

203 సూ. దర్భలయందుఁగూర్చుండి దర్భలను ధరించి నీటిచేఁ దడసిన చేతితోఁ బ్రత్యఙ్ముఖుడై సావిత్రీ మంత్రమును వేయిసార్లు ఆవర్తింపవలెను. (బో. 2,4,5)

204 సూ. ప్రాణాయామములను బట్టి నూఱుసార్లు గాని అవర్తింపవలెను. [బో. 2-4-5]

205 సూ. [illegible] [illegible] ఓంకారమును బలుకుచు ఏడు వ్యాహృతులు గలుగునట్లు పదిసార్లు మనసుచేఁ గాని సావిత్రిని ఆవర్తింప వలయును. (బో. 2-4-7)

వివ: ఓం భూః, ఓం భువః ఒం సువః, ఓం మహః, ఓం జనః ఓం తపః, ఓం సత్యం అను ఈ యేటిని వ్యాహృతులందురు,

206 సూ. మూఁడు ప్రాణాయామముల చేత "ఓం భూః ఓం భువః" అను అనువాకముచే శాంతిని పొంది సావిత్రిని ఆవ ర్తింపవలయు. (బో. 2-4-8)

వివ: గాలిని బీల్చి వ్యాహృతులతోఁ గూడిన ఓంకారముతోఁ గూడన గాయత్రిని మనస్సులో మూఁడుసార్లు ధ్యానించి గాలిని విడచుట ఒక ప్రాణాయమనబడును.

207 సూ. నక్షత్రములు కనిపించు చుండఁగ మొదలు పెట్టి సూర్యుఁడు కనిపించు సమయమునసమాప్తి చేయవలయు [బో. 2-4-12]

208 సూ. సూర్యుఁడస్తమించకుండఁ బ్రారంభించి నక్ష త్రములు కనిపించునంతలో ముగింప వలయును[బో-2,4,13]

209 సూ. సంధ్యలందు సంపూర్ణత్వము సిద్ధించినచో ఆయువు విచ్ఛిత్తినిబొందదు. [బో. 2,4,14]

210 సూ తత్ర సాయ మతిక్రమే రాత్ర్యుతవాసః ప్రాత రతిక్రమే అహరుపవాసః (బో, 2,4,16)

211 సూ. స ఏవమే వాహరహ రహోరాత్రయోః సంధి షూపతిష్ఠమానో బ్రహ్మపూతో బ్రహ్మభూతో బ్రాహ్మణః శాస్త్ర మనువర్తమానో బ్రహ్మలోక మభిజయతీతి విజ్ఞాయతే [గౌ. 2_4-24]

## అథ శౌచ ప్రకరణము

212 సూ. అథాతశ్శౌచాధిష్ఠానం [బో, 1-5-1]

213 సూ. అద్భిశ్శుద్ధ్యంతిగాత్రాణి బుద్ధిః జ్ఞానేన శుద్ధ్యతి అహింసయాచ భూతాత్మా మనస్సత్యేన శుద్ధ్యతి [బో. 1-5-2]

213 సూ. మనశ్శుద్ధిరంతశ్శౌచం [బో- 1,5,3]

215 సూ. బహిశ్శౌచం వ్యాఖ్యాస్యామః (బో- 1,5,4)
స్వయంధౌతేన కర్తవ్యాక్రియాధర్మ్యా విపశ్చితా
నతు నౌజకధౌతేన నా హతేన నకుత్ర చిత్ (దేవలః)

216 సూ. కౌశంసౌత్రం వాత్రి ప్రివృద్యజ్ఞోపవీత మానాభే ర్దక్షిణం బాహుముద్ధృత్య సవ్యమవధాయ శిరోఽవదధ్యాత్ [బో- 1.3.5]

210 సూ. అందు రాత్రి సంధ్యోపాసన నతిక్రమించినచో రాత్రి యుపవసింపవలయు. ప్రాతస్సంధ్య యతిక్రమించనచో పగలు ఉపవసింపవలయు. (బో. 2-4-16)

211 సూ. అతఁడిట్లే ప్రతిదినము రేయింబవళ్ళు సంధ్యలందు ప్రవర్తించుచున్నవాడై ప్రణవముచేఁ బవిత్రుఁడై బ్రహ్మరూపుఁడై బ్రాహ్మణుడై శాస్త్రమనుసరించుచు బ్రహ్మలోకమును జయించునని తెలియుచున్నది. బ్రహ్మలోకమును జయించునని తెలియుచున్నది. (గౌ. 2-4-24)

మఱి యింకశౌచప్రకరణము

212 సూ. మఱియింక శౌచకారణములు చెప్పఁబడుచున్నవి. (బో. 1-5-1)

213 సూ. శరీరము నీళ్ళచేఁ బరిశుద్ధమగును. జ్ఞానముచే బుద్ధి పరిశుద్ధ మగును. అహింసచే జీవుడు శుద్ధుఁడగును. సత్యముచే మనస్సు పరిశుద్ధ మగును. (బో. 1-5-2)

214 సూ. మనస్సు పరిశుద్ధ మగుటమె యంతశ్శౌచమనఁబడును. (బో. 1-5-3)

215 సూ. బాహ్యశౌచమును వ్యాఖ్యానించెదము. (బో. 1-5-4)

స్వయముగా ఉతికిన వస్త్రముచే పండితుఁడు ధర్మయుక్తమైన కర్మనుచేయవలెను. చాకలి యుదికిన వస్త్రముతో ధర్మయుక్తమైన కర్మము జేయరాదు. ఉదుకని బట్ట ధరించి గాని ఎక్కటను చేయరాదు.

216 సూ. దర్భలతోఁగాని సూలుతోఁగాని మూఁడుమూఁడు జేసి మొత్తము తొమ్మిది పోచలు పైనవేసి యజ్ఞోపవీతమును జేసి బొడ్డుదాక కుడిచేతి నెత్తి యెడమవైపు మెడమీదఁ దాల్పవలయు. (బో. 1-5-5)

217సూ. ఓంకారఃప్రథమస్తంతుర్ద్వితీయోఽగ్నిస్తథైవచ

తృతీయో భగవద్దైవత్య శ్చతుర్థ స్సోమదైవతః
పంచమః పితృదైవత్యః షష్ఠశ్చైవ ప్రజాపతిః
సప్తమో విష్ణుదైవత్యో ధర్మశ్చాష్టమఏవచ
నవమస్సర్వదైవత్య ఇత్యేతే నవతంతవః[దేవలస్మృతి]

218 సూ. బ్రాహ్మణోయోనజానాతి హ్యుపవీతస్యసుస్థితిం
మోహాత్మా పహతేఘోరం పశుర్గౌరివ పర్వరా [పితామహః]
ఏతన్నాభిజానాతియదాతదాస్యాదుశుచిర్నరః[గౌ.ఆచార్యకాండ

అపివా వాససీ యజ్ఞోపవీతార్థంకుర్యాత్,తదభావేత్రివృతా
సూత్రేణ [ఋశ్యశృంగః]

219 సూ. ఉపాసినేగురూణాం వృద్ధానా మతిథీనాం,
హోమేజప్యకర్మణి, భోజన, ఆచమనే, స్వాధ్యాయేచ యజ్ఞోప
వీతీస్యాత్ [ఆప. 5-1-1]

వివ:- నాసోవిన్యాస విశేషోయజ్ఞోపవీతం వాససోఽసంభ
వేఽనుకల్పం వక్ష్యతి అపివాసూత్రమేవోపవీతార్థం(ఆప. ,4,22
ఏషుకర్మసుయజ్ఞోపవీతంవిధానావత్కాలాంతరేనావశ్యంభావః

219 సూ. సర్వవిధ జ్ఞానకర్మ యజ్ఞబద్ధదీక్షతాచిహ్నె
యజ్ఞోపవీతస్తత ఏవయజ్ఞోపవీత-ఇతి సార్థకంనామ ఇతిహి
ఆధునికాః

221 సూ. బాహ్యచిహ్నస్యాభావేఽపి న హాని రితిగాంధీ.

217 సూ. ఓంకారము మొదటి తంతువు, రెండవది యగ్ని దేవతాకము, మూఁడవదానికి భగదేవత నాల్గవదానికి సోముఁడు అయిదవ దానికి పితృదేవతలు, ఆఱవ దానికి ప్రజాపతి ఏడవ దానికి విష్ణువు ఎనిమిదవదానికి ధర్మము తొమ్మిదవదానికి శర్వ దేవతలు ఇట్లునవతంతువులగుఱించి తెలియవలయు (దేవలస్మృతి

218 సూ. ఉపవీతము యొక్క సంస్థితిని ఎఱుఁగని బ్రాహ్మణుఁడు బరువు మోయు పశువువలె మూర్ఖుఁడు [పితామహుడు

అని తెలియని వాడు అశుచియగును.

[గౌ. ఆచారకాండము]

యజ్ఞోపవీతము కొఱకు రెండు వస్త్రములను ధరింపవలెను అవి లేనిచో మూడు పోచలు పెనవేసిన సూత్రము ధరింపవలెను

[ఋశ్యశృంగుఁడు]

219 సూ. గురువులను వృద్ధులను అతిథులను బూజించు నపుడును, హోమమునందును, జపకర్మ యందును, భోజనకాల మందును ఆచమన కాలమందును, వేదము చదువు నపుడును యజ్ఞోపవీతధారియై యుండవలయును. [అవ, 5-1-1]

వివ:- వస్త్ర విన్యాస విశేషము జందెము అట్టి వస్త్రము సంభ వింపనపుడు పక్షాంతమున "సూత్రముగాని యుపవీతము కొఱకు ధరింపవలెను. ఈ కర్మలలో జందెము ఉండ వలయునని చెప్పుట వలన మిగిలినచోట్ల అనవసరమని భావము.

220 సూ. అన్ని విధములైన జ్ఞానకర్మ యజ్ఞములందు బద్ధదీక్షుఁడనుసంగతికి యజ్ఞోపవీతము బాహ్యచిహ్నము. అందు వలననే యజ్ఞోపవీతము అని దానిపేరు సార్థకమన్ని ఆధునికులు.

221 సూ. బాహ్యచిహ్నము లేకపోయినను హాని లేదన్ని గాంధి మహాత్ముఁడు.

సూ. విపరీతం పితృభ్యః [బో. 1-5-6]

222 సూ. కంఠేఽవసక్తం నివీతం [బో. 1-5-7]

223 సూ. అధోఽవసక్త మధోపవీతం [బో. 1-5-8]

224 సూ. ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖో వాఽఽసీన శ్శౌచమారభేత శుచౌ దేశే దక్షిణం బాహుం జాన్వంతరా కృత్వా ప్రక్షాల్య పాదౌ చా మణి బంధనాత్ [బో. 1-5-9]

225 సూ. పాదప్రక్షాళనోచ్ఛేషణేషు నాచామేద్యద్యాచామే ద్భూమౌ స్రావయిత్వా ఆచామేత్ [బో. 1 5-10]

226 సూ. బ్రాహ్మేణ తీర్థే నాచామేత్ [బో. 1-5-11]

22. సూ అంగుష్ఠమూలం బ్రాహ్మం తీర్థం [బో. 1-5-12]

228 సూ. అంగుష్ఠాగ్రం పిత్ర్యమంగుళ్యగ్రం దైవమంగుళి మూల మార్ష మంగుళ్యంగుష్ఠయోర్వా మధ్యం పిత్ర్యం [బో. 1-5-13]

229 సూ. నాంగుళీభిర్న సబుద్బుదాభిర్న ఫేనాభిర్నోష్ణాభి ర్న క్షారాభిర్న లవణాభి ర్న కలుషాభి ర్న వివర్ణాభిర్న దుర్గంధ రసాభిః [బో. 1-5,14]

222 సూ. పితృదేవతల నుద్దేశించి కర్మ చేయునపుడు యజ్ఞోపవీతమును విపరీతముగా ధరింపవలయు [బో. 1,5,6]

223 సూ. మెడయందు వేలాడునట్లు జందెము వేసికొనుట నివీత మనఁబడును. అభ్యంగ వాదులందు నాభి క్రింద వేలాడుట అధోవీత మనఁబడు. [బో. 1-5-8]

224 సూ. తూర్పుగఁ గని యుత్తరముగఁగాని ముఖము పెట్టి శుచి దేశమున కుడిచేయి మోకాళ్ళ మధ్య నుంచి కాళ్ళు కడుగుకొని చేతులుకూడ మణికట్టు వఱకుఁ గడుగుకొని శౌచ మారంభింపవలెను. [బో. 1-5-9]

225 సూ. కాళ్ళు జడుగఁగా మిగిలిన నీటితో నాచమించరాదు. ఆచమించుచో నేలమీదఁ గొంచెము నీరుపోసి ఆచమింపవలెను. [బో. 1-5-10]

226 సూ. బ్రాహ్మ తీర్థముతో నాచమింపవలయు [బో. 1-4-11]

227 సూ. బొటనవ్రేలి మొదలువఱకుఁ గలనీరు బ్రాహ్మతీర్థ మనఁబడు, (బో. 1-4-12)

228 సూ. బొటనవ్రేలి చివర వఱకున్నచోఁ బిత్ర్యము వ్రేళ్ళ చివరవఱకున్నచో దైవము, వ్రేళ్ళ మొదటివఱకున్నచో నార్షము. వ్రేళ్ళకు బొటనవ్రేలికి మధ్యగానున్నఁగాని పిత్ర్యము అనఁబడు. (బో. 1,5,14)

229 సూ. బుడగలు, నురుగు, వేడి, కారము, ఉప్పు, మఱికి, వివర్ణము, దుర్గంధ రసముగల నీళ్ళుగల వ్రేళ్ళతో నాచమింపరాదు, (బో. 1,5,14)

230 సూ. మూత్రం కృత్వా పురీషం వా మూత్ర పురీష లేపా నన్న లేపానుచ్ఛిష్ట లేపాన్ రేతసశ్చయో లేపాస్తాన్ ప్రక్షాళ్య పాదౌ చాచమ్య ప్రయతో భవతి [ఆప. 1,5,23]

సూ. అహస, న్న జల్ప, న్న తిష్ఠ, న్న విలోకయ న్న ప్రహ్వః న ప్రణతో, నముక్త శిఖో, నప్రావృతకంఠో, నవేష్టితశిరా నత్వరమాణో, నాయజ్ఞోపవీతీ, నప్రసారితపాదో, నబద్ధకక్ష్యో, నహిర్ణామః, శబ్దమకుర్వన్, త్రిరపోహృదయంగమాఃపిబేత్
(బో. 1,5,15)

231 సూ. త్రిఃపరిమృజేత్, ద్విరిత్యేకే (బో.1,5,19)

232 సూ. సకృదుభయంస్త్రియాశూద్రస్యచ(బో.1,5,17

233 సూ. గతాభిర్హృదయం విప్రః కంఠ్యాభిఃక్షత్రియః శుద్ధ్యేత్ వైశ్యోద్భిః ప్రాశితాభిస్స్యాత్ స్త్రీశూద్రౌస్పృశ్యచాంతతః
(బో. 1,55,17)

234 సూ. ద్రవ్యశుద్ధి, 1 పరిమార్జన 2 ప్రదాహ 3 తక్షణ 4 నిర్ణేజనాని । తైజస । మార్తిక 3 దారవ 4 లాంతవానాం
(గౌ, 1,3,1)

235 సూ. తైజసానాముచ్ఛిష్టానాంగోశకృద్భస్మభిః పభిమా మన్యత మేనవా (బో. 1,5, 6)

236 సూ. తామ్రరజత సువర్ణామమ్లైః (బో.1,5,27

230 సూ. మూత్ర పురీషములను విడిచి చేతికంటుకొన్న దాని లేపములను అన్న లేపనములను, ఎంగిలిని, రేతస్సు అంటుకొన్నచో దానిని కడిగి కాళ్ళను గడిగి ఆచమించినచో ప్రవిత్రుఁ డగును. [ఆప. 1-5-23]

సూ. నవ్వక, పలుకక, నిలుచుండక, దిక్కులు చూడక వంగక, మోకరిల్లక, ముడి విప్పక, మెడగవ్వ కొనక, తలపాగ చుట్టుకొనక, తొందరగఁ బోవక, జందెము విడువక, కాళ్ళుచాపక షడుము కట్టుకొనక, మోకాళ్ళకు చేతులు వెలుపలి నుంచక, చప్పుడు చేయక, మూఁడు సార్లుహృద్యములైన నీరు ఆచమింపవలెను. [బో. 1-5-15]

231 సూ. మూఁడుసార్లు తుడుచుకొనవలెను. రెండు సార్లు అని కొందఱు. [బో. 1-5-16]

232 సూ. స్త్రీలకుశూద్రులకు ఆచమనము, తుడుచుకొనుట యొక్కసారె. [బో. 1-5-17]

233 సూ. జలము హృదయము చేరఁగా విప్రుఁడును కంఠము పొందఁగ క్షత్రియుఁడును, త్రాగఁగా వైశ్యుఁడును చివరకు ముట్టుకొని స్త్రీ శూద్రులు శుచులగుదురు. [బో. 1-5-17]

234 సూ. తైజస పాత్రములు (లోహములు) త్రోముట చేతను మట్టిపాత్రలు గాల్చుట చేతను, కఱ్ఱ పాత్రలు చెక్కుట చేతను తంతు వస్త్రము లుదుకుట చేత శుద్ధమగును (గౌ.1-3-1)

235 సూ. ఎంగిలి యయిన తైజస ద్రవ్యములు పేడ గూడిద రెంటిచేఁ దోముటచేత లేక యేదొయొక దానిచేఁ దోముటచేతను శుద్ధములగు. (బో. 1-5-16)

236 సూ. రాగి,వెండి,బంగారు పాత్రములు పుల్లని వస్తువులచే దోముటచే శుద్ధములగు. (బో. 1-5-17)

237 సూ. తైజసవదుపల మణిశంఖశుక్తీనాం (గౌ. 1_32)

238 సూ. పైణవానాం గోమయేన (బో. 1_5_30)

239 సూ. దారువదస్థిభూమ్యోః (గౌ. 1_33)

240 సూ. ఆవపనంచభూమేః (గౌ. 1_38)

241 సూ. చేలవద్రజ్జు విదలచర్మణాం (గౌ. 1,35)

242 సూ. కృష్ణాజినానాం బిల్వతండులైః (బో. 1,5,32)

243 సూ. కుతుపానా మరిష్టైః (బో. 1,5,33)

244 సూ. ఊర్ణానామాదిత్యేన (బో 1,5,34)

245 సూ. క్షౌమాణాం గౌరసర్షపకల్కేన [బో. 1,5,35]

246 సూ. మృదా చేలానాం [బో. 1,5,36]

247 సూ. మూత్రపురీషాసృక్, శుక్ల, కుణప, స్పృష్టానాం పూర్వోక్తానా మన్యతమేన త్రిస్సప్తకృత్వః పరిమార్జనం. [బో. 1,5,42]

237 సూ. మణులకు శంఖములకు ముత్యములకు తైజసములకు వలె శుద్ధియగు. (గౌ_ 1_32)

238 సూ. వెదురు వస్తువులకుఁ జేడచే శుద్ధి గరుగు. (బో. 4-5.30)

239 సూ. ఎముకలకు భూమికి కఱ్ఱకు వలె శుద్ధి కలుగు [గౌ. 1-33]

240 సూ. దున్నుటచే భూమికిని శుద్ధి కలుగు [గౌ. 1,34]

241 సూ. త్రాడు, ఈకలచేఁ జేయబడినవి చర్మములు వస్త్రమునకు వలె శుద్ధి కలుగు [గౌ. 1,35]

242 సూ. కృష్ణాజినములకు బిల్వతండుల పిష్టమును బూయుటచే శుద్ధియగు. [గౌ. 1,5,32]

243 సూ. కంబళములకు పూయు వృక్షఫలములచే శుద్ధి కలుగు. (బో. 1-5_33)

244 సూ ఉన్ని వస్త్రములు ఎండచే శుద్ధములగు (బో. 1_5_35)

245 సూ. పట్టువస్త్రములు తెల్లయావాల కల్కముచే శుద్ధములగు (బో. 1 5-35)

246 సూ_ నూలు బట్టలకు మట్టిచే శుద్ధి కలుగు (బో. 1,4,36)

247 సూ, మూత్రము, మలము, రక్తము, శుక్లము, కుణపము వానిచే స్పృశింపఁబడిన పూర్వోక్త ద్రవ్యములకు గోమయాదులలో నెదో యొకదానిచే ఇరువది యొక్కమార్లు పరిమార్జనము చేయవలెను (బో, 1,5,42)

248 సూ, ఉత్సర్గోవా అత్యంతపరిహతానాం
(గౌ. 1.36)

249 సూ, శాక, పుష్ప, ఫల, మూలౌషధీనాంతుప్రక్షాళనం
(బో, 1,5,67)

250 సూ, మూత్రైమృదాఽద్భిః ప్రక్షాళనం (బో, 1,5,69)

251 సూ, త్రిఃపాణేః (బో, 1,5,70)

252 సూ, తద్వత్పురీషే (బో, 1,5,71)

253 సూ, నాభేరథస్స్పర్శనం కర్మయుక్తో వర్జయేత్
(బో, 1,5,75)

ఇతి గృహస్థ ధర్మాః
చతుర్థోఽధ్యాయః సమాప్తః

258 సూ. మిగుల పొడైన వానికిఁ బలిత్యాగము గాని చేయవలెను. (గౌ. 1,5,36)

259 సూ. కూరలు, పువ్వులు, పండ్లు, దుంపలు, ఓషధులు కడిగినందువల్ల శుద్ధములగు. (బో. 1,4,67)

250 సూ మూత్ర విసర్జన పిదప మట్టితో నీళ్లతో కడుగవలెను. (బో. 1,5,69)

251 సూ. చేయి మూఁడుసార్లు కడుగవలెను. (బో. 1,5,70)

252 సూ మల విసర్జమందిట్లే తెలియునది. (బో. 1,5,71)

253 సూ. బొడ్డు క్రింద భాగమును కర్మయుక్తుఁడు స్పృశించుట పరిత్యజింప వలయును. (బో. 1,5,72)

ఇవి
గృహస్థ ధర్మములు
నాలుగవ యధ్యాయము సమాప్తము

## అథవానప్రస్థప్రకరణము
## పంచమోఽధ్యాయః

1 సూ. ఏవం గృహస్థాశ్రమే స్థిత్వా విధివత్స్నాతకో ద్విజః వనే వసేత్తు నియతో యథావద్విజితేంద్రియః
(మను. 6,1)

2 సూ. గృహస్థస్తు యదాపశ్యేద్వలీపలితమాత్మనః అపత్యస్యైవచాపత్యంతదారణ్యం సమాశ్రయేత్ [మను. 6, ]

3 సూ. సంతజ్య గ్రామ్యమాహారంసర్వంచైవ పరిచ్ఛదం పుత్రేషుభార్యాం నిక్షిప్యవనంగచ్ఛేత్సహైవవా [మను. 6,3]

5 సూ. వానప్రస్థో జటిలశ్చీరాజిన వాసా గ్రామంచన ప్రవిశేత్ [వసి. 9-1]

5 సూ. నఫాలకృష్ట మధితిష్ఠేత్ [వసి. 9-2]

6 సూ. అకృష్టం మూలఫలం స చిన్వీత, ఊర్ధ్వరేతాః క్షమాశయః [వసి. 9-3]

7 సూ, మూలఫల భైక్షేణాఽఽశ్రమ్యాగతమతిథి మభ్యర్చయేత్. (వసి. 9,4)

8 సూ. దద్యాదేవ న ప్రతిగృహ్ణీయాత్ (వసి. 9,5)

9 సూ. త్రిషవణ ముదం ముపస్పృశేత్ (వసి. 9,6)

## మఱి వానప్రస్థ ప్రకరణము
## పంచమాధ్యాయము

1 సూ. ఇట్లు గృహస్థాశ్రమమందుండి పిదపగృహస్థాశ్రమ దీక్ష ముగింపు స్నానముచేసి ద్విజుఁడు నియమముతో ఇంద్రి యముల జయించి వనమందు నివసింపవలెను. [మను. 6–1]

2 సూ. గృహస్థుఁడు తన జుట్టునెరయుటను, తన సంతానమునకు సంతానమును జూచి యప్పుడరణ్యము నాశ్రయింపవలె. [మను. 6,2]

3 సూ. గ్రామము అందలి యాహారము మాని సర్వమైన గవాశ్వాది పరివారములను వీడ భార్యను గొడుకుల కప్పగించి యామెతోఁగాని వనమునకుఁ బోవలెను. [మను. 6,3]

4 సూ. వానప్రస్థుఁడు జడలుదాల్చి నారబట్టను చర్మమును ధరించవలెను గ్రామములోనికి బ్రవేశింపరాదు. [వసి, 9,5]

5 సూ, కృషికిఁబనికివచ్చు పొలములందుండరాదు [వసి. 9–6]

6 సూ, దున్నని ప్రదేశము అందలి దుంపలు పండ్లు ప్రోగు చేసికొన్ని యూర్ధ్వరేతుఁడై, ఓర్పుగలవాఁడై యుండవలెను. [వసి, 9,3]

7 సూ, దుంపలతో పండ్లతోనుభైక్షముతోను ఆశ్రమమునకు వచ్చిన యతిథిని బూజింపవలెను [వసి, 9–4]

8 సూ, దానము చేయవలయువేకాని ప్రతిగ్రహింపరాదు [వసి, 9–5]

9 సూ, మూఁడు సంధ్యలందు జలము నాచమనము చేయవలెను. [వసి. 9–6]

10 సూ, ఊర్ధ్వంషడ్భ్యో మాసేభ్యోఽనగ్నిరనికేతః
[వసి, 9-7]

11 సూ, తస్యారణ్య మాచ్ఛాదనం విహితం
[అవ, 2-9-22-1]

12 సూ, తతో మూలైః ఫలైః పర్ణైస్తృణై రితివర్తయం శ్చరేత్ — [అవ, 2,9,22,2]

13 సూ, అంతతః ప్రవృత్తాని [అవ, 2,9,22,3]

14 సూ, తదోఽపో వాయుమాకాశమిత్యభినిశ్రయేత్
[అవ, -9-22-4]

15 సూ, తేషాముత్తర ఉత్తరఃసంయోగః ఫలతో విశిష్టం
[అవ, 2-9-22-5]

16 సూ, శిలోంఛేన వర్తయేత్ (అవ- 2-9-22-10)

17 సూ. అగ్న్యర్థం శరణం (అవ. 2,9,22,21)

18 సూ. ఆకాశే స్వయం (అవ. 2,9,22,22)

19 సూ. అనువస్త్రే శయ్యాసనే (అవ. 2,9,22,23)

20 సూ. భూయాంసంవా నియమ మిచ్ఛన్నన్వహమేవ పాత్రేణ సాయంప్రాత రర్థమాహరేత్ (అవ. 2,9,22,24)

10 సూ. ఆరు మాసముల పిదవ అగ్నిని విడిచి యిల్లు లేక యుండ వలయును. (వసి. 6-7)

11 సూ. అతనికి వనసంబంధమైన యాచ్ఛాదనము విహితము. (ఆప. 2-9 22-1)

12 సూ. పిదప దుంపలచేతను,పండ్లచేతను,ఆకులచేతను తృణముచేతను జీవితము గడుపుచుఁ జరింపవలెను (ఆప. 2-9,22,4)

13 సూ. రాలినపండ్లు మొదలైనవి గ్రహింపవలెను. (ఆప. 2,9,22,4)

14 సూ. పిదప నీరు, గాలి, యాకశమును ఆశ్రయింప వలెను. (ఆప. 2-9-22-6)

15 సూ. వీటిలోఁ జివర చివర వానిని గ్రహించుట ఫల ము ను బట్టి శ్రేష్ఠమైనది. (ఆప. 2-9-22-8)

16 సూ. శిలము ఉంఛము అనువృత్తులతో జీవితయాత్ర గడుపవలెను. (ఆప. 2-9-22-10)

17 సూ. ఇల్లు అగ్నినుంచుట కొఱకు మాత్రమె యుంచు కొనవలెను. (ఆప. 2-9-22-21

18 సూ. తాను మాత్రము అకాశమున నుండవలయు. (ఆప. 2-9-22-22)

19 సూ. శయనమునకు ఆసనమునకు ఆస్తరణ యుండ రాదు. (ఆప. 2-9-22-23)

20 సూ. ఎక్కువ నియమము గోరి ప్రతిదినము పాత్రచే సాయంకాలము ప్రొద్దుట ఆహారము మాత్రము తెచ్చుకొన వలయును. (ఆప. 2-9-22-

21 సూ. అథవానప్రస్థస్య ద్వైవిధ్యం (బో. 3-3-1)

22 సూ. పచమానకా అపచమానకాశ్చేతి (బో. 3-3-2)

23 సూ. అత్రపచమానకాః పంచవిధాః సర్వారణ్యకాః వైతుషికాః కందమూలభక్షాః ఫలభక్షాః శాకభక్షాశ్చేతి
[బో, ,3,6,3]

24 సూ. తత్ర సర్వారణ్యకా నామ ద్వివిధా ద్వివిధ మారణ్యమాశ్రిమంత ఇంద్రావసిక్తా రేతోవసిక్తాశ్చేతి
[బో. 3,3,4]

25 సూ. తత్రేంద్రావసిక్తా నామ వల్లీ గుల్మలతావృక్షాణా మానయిత్వా శ్రపయిత్వా సాయంప్రాతరగ్నిహోత్రం హుత్వా యత్యతిథివ్రతిభ్యశ్చ దత్త్వా అథేతరచ్ఛేషభక్షాః
[బో. 3,౮,5]

26 సూ. రేతోఽవసిక్తా నామ మాంసం వ్యాఘ్ర వృకశ్యే నాదిభి రన్యతమేనవా హతమానయిత్వా శ్రపయిత్వా సాయం ప్రాతరగ్నిహోత్రం హుత్వా యత్యతిథి వ్రతిభ్యశ్చ దత్త్వాఽథేతర చ్ఛేష భక్షాః
[బో. 3,3,6]

21 సూ. మఱియు వానప్రస్థుఁడు రెండు విధములుగ నుండును. [బో. 3,3,1]

22 సూ. పచమానకులు అపచమానకులు అని [బో. 3,3,2]

23 సూ. అందు పచమానకులు సర్వారణ్యకులు, వైతుషికులు, కందమూల ఫలభక్షులు, ఫలభక్షులు, శాకభక్షులు అని యయిదు విధములు. [బో. 3,3,3]

24 సూ. అందు సర్వారణ్యకులు ఇంద్రావసిక్తులు రేతోవసిక్తులు అని రెండు విధములుగ అరణ్యము నాశ్రయించుచున్నారు. [బో. 3-3-4]

వివ: ఇంద్రావసిక్తులు=ఇంద్రుడు వర్షము కురిపింపఁగా మొలచినవి తినువారు. రేతోవసిక్తులు=వీర్య జన్యములగు జంతువుల మాంసము దినువారు.

25 సూ. అందు ఇంద్రావసిక్తులుపొదులు,పొదలు,తీగెలు వృక్షముల సంబంధించిన వానిని దెచ్చి వండి ప్రొద్దుట సాయంకాలము అగ్నిని హోత్రముచేసి యతులకు అతిథులకు వ్రతధారులకు పెట్టి మఱియింక మిగిలినదానిని భుజింతురు. [బో. 2-3-5]

26 సూ. మఱి యింక రేతోవసిక్తులనువారు పెద్దపులి, తోడేలు డేగలలో దేనిచేనైన జంపఁబడిన దాని మాంసమును దెచ్చి వండి ప్రొద్దుట సాయంకాలము అగ్నిని హోమము చేసి యతులకు అతిథులకు వ్రతధారులకు పెట్టి మఱియింక మిగిలిన దానిని భుజింతురు (బో. 3,3,6)

27 సూ. వై తుషికా, స్తుషధాన్యవర్జం తండులానావ యిత్వా శ్రపయిత్వా సాయం ప్రాతరగ్నిహోత్రం హుత్వా యత్యతిథివ్రతి భ్యశ్చ దత్త్వాథేతరచ్ఛేషభక్షాః [బో. 3-3-7]

28 సూ. కంద, మూల, ఫల, శాకభక్షాణామప్యేవమేవ (బో. 3-3-8)

29 సూ. పంచైవాఽపచమానకా 1 ఉన్మజ్జకాః 2 ప్రవృత్తాశినో 3 ముఖేనాదాయిన 4 స్తోయాహారా 5 వాయుభక్షాశ్చేతి (బో. 3-3-9)

30 సూ, తత్రోన్మజ్జకానామ లోహాశ్మకరణ వర్జం [బో, 3,3,10]

వివ: లోహాదిసాధన వర్జం ఫలాదీనానయిత్వా భక్షయం తీతి శేషః

31 సూ, హస్తేనాదాయ ప్రవృత్తాశినః [బో, 3,3,11]

42 సూ, ముఖేనాదాయినో ముఖేనాదదతే [బో. 3,3,12]

33 సూ, తోయాహారాః కేవలం తోయాహారాః (బో, 3,3,13)

34 సూ, వాయుభక్షా నిరాహారాశ్చ (బో, 3,3,14)

ఇతి వానప్రస్థ ప్రకరణం

27 సూ. వైతిషికులు పొల్లుధాన్యముల విడిచి మిగిలిన బియ్యము దెచ్చి వండి పొద్దుట సాయంకాలము అగ్నిని హోమము చేసి అతిథులకు వ్రతధారులకు పెట్టి మిగిలినదానిని భుజించువారు. (బో. 3-3-7)

28 సూ. దుంపలు, వ్రేళ్ళు, పండ్లుకూరలు తినువారి విషయముగూడ నిట్లే తెలియునది. (బో. 3-3-8)

29 సూ. ఉన్మజ్జకులు, ప్రవృత్తాశులు, ముఖాదాయులు, తోయాహారులు, వాయుభక్షకులని అపచమానకు లయిదు విధములు (బో. 3-3-9)

30 సూ. ఇనుము రాళ్ళుకట్టల సాధనములు లేకుండ ఫలాదులను దెచ్చి తినువారు ఉన్మజ్జకులనఁబడుదురు (బో. 3,3,10)

3 సూ. చేతులతోఁ దెచ్చి తినువారు ప్రవృత్తాశులు (బో. 3-31-1)

32 సూ. ముఖాదాయులు పశువులవలె నోటితోనే గ్రహించి తిందురు. (బో. 3-3 12)

33 సూ. తోయాహారులు కేవలము నీరుమాత్రమె ఆహారముగ గ్రహింతురు. (బో. 3-3-13)

34 సూ. వాయుభక్షకులు గాలి మాత్రమె పీల్చి నిరాహారులై యుందురు (బో. 3-3-14)

ఇది వానప్రస్థ ప్రకరణము

## అథ పరివ్రాజకప్రకరణం

### షష్ఠోఽధ్యాయః

1 సూ. పరివ్రాజకః పరిత్యజ్య బంధూ నపరిగ్రహః పరివ్రజే ద్యథావిధి (బో. 7.9-18)

3 సూ. ఊర్ధ్వరేతాః (గౌ. 3-11)

4 సూ. కౌపీనాచ్ఛాదనః (బో. 2-6-22)

5 సూ. కాషాయవాసాః [బో. 2-6-23]

6 సూ. ధ్రువశీలో వర్షాసు (గౌ. 3-13)

7 సూ. భిక్షార్థీ గ్రామ మియాత్ [గౌ. 3-14]

8 సూ. గోదోహనమాత్ర మాకాంక్షేత [బో. 2-10-44]

9 సూ. అష్టౌగ్రాసా మునేర్భక్ష్యాః షోడశారణ్యవాసినః ద్వాత్రింశతం గృహస్థస్యాపరిమితం బ్రహ్మచారిణః [బో. 2,10,53]

10 సూ. జఘన్య మనివృత్తం చరేత్ [గౌ. 3-15]

11 సూ. నివృత్తాశీః [గౌ. 3-16]

## ఇంకఁ బరిమ్రాజక ప్రకరణము
## ఆఱవయధ్యాయము

1 సూ. పరివ్రాజకుఁడు బంధువులను విడిచి తనది యన్నది యేమియు లేనివాఁడై యథావిధిగ నిల్లువిడిచి వెళ్ళవలయును (బో, 7,6,18)

3 సూ. సంన్యాసి ఊర్ధ్వరేతుఁడై యుండవలెను [గౌ. 3-12]

4 సూ. భిక్షకులు కౌపీనమునే యాచ్ఛాదనముగఁ దాల్పవలయును (బో, 2,6,21)

5 సూ. కాషాయవస్త్రమును ధరింపవలయు (బో. 2-6-3

6 సూ. వర్షాకాలమునందొకచోటనె యుండవలెను (గౌ. 3_1

7 సూ. భిక్షకొఱకు గ్రామమునకు వెళ్ళవలయును (గౌ. 3-14)

8 సూ. అవుపాలు పితుకుట కెంత సమయము పట్టునో యంతకాలమె భిక్షకై ప్రతీక్షింపవలయు (బో. 2,10,44)

9 సూ. ముని యెనిమిది ముద్దలును, అరణ్యవాసి వానప్రస్థుఁడు పదునాఱుముద్దలు, గృహస్థుఁడు ముప్పదిరెండును, బ్రహ్మచారి పరిమితముకాని ముద్దలను భక్షింపవలయు (బో. 2,10,53)

10 సూ. భోజనమైనపిదపఁ బెట్టకుండఁ బొమ్మనిన యింటికి మఱలఁబోవరాదు. (గౌ. 3-15)

11 సూ. భిక్షపుచ్చుకొనుట, నమస్కరించుట మొదలగు సమయములందు ఆశీర్వదింప మానవలెను. (గౌ. 3_16)

12 సూ. వాక్చక్షుః కర్మసంయతః (గౌ. 3-17)

13 సూ. నావిప్రయుక్తమోషధి వనస్పతీ నామంగ ముపాదదీత (గౌ. 3-20)

14 సూ. న ద్వితీయా మపర్తు రాత్రిం గ్రామే వసేత్ (గౌ. 3-21)

వివ:- ఋతురిహ వర్షాఋతుః

15 సూ. ముండశ్శిఖీవా (గౌ. 3-22)

16 సూ. వర్జయేద్బీజవధం [గౌ. 3-23]

17 సూ. నమో భూతేషు [గౌ. 3-24]

18 సూ. హింసానుగ్రహయోనారంభీ [గౌ. 3-25]

19 సూ. సత్యానృతే, సుఖదుఃఖే, వేదా, నిమంలోకమ ముంచ పరిత్య జ్యాత్మాన మన్విచ్ఛేత్ [ఆప. 2,9,21,12]

20 ఉక్తో వర్ణ ధర్మశ్చాశ్రమధర్మ శ్చ [గౌ. 19-1]

21 సూ. వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మ నిష్ఠాః ప్రేత్యకర్మ ఫల మనుభూయ తతశ్శేషేణ విశిష్ట దేశ జాతికుల రూపాయు శ్శ్రుత వృత్తవిత్త సుఖమేదసో జన్మ పద్యంతే [గౌ, 11,31]

11 సూ. మాటాడుటయందుఁ జూచుటయందు నియమముగ నుండవలయును [గౌ. 3-17]

13 సూ. వృక్షాదులనుండి స్వయముగా రాలని వానిని స్వీకరింవరాదు. [గౌ. 3-20]

14 సూ. వర్షాకాలమునందుఁగాక మిగిలినప్పుడు రెండవ రాత్రి గ్రామమునందుండరాదు [గౌ. 3-22]

15 సూ. పూర్తిగా ముండనము చేయించుకొనవలయును లేదా శిఖను దాల్చవలయు [గౌ. 3-22]

16 సూ. గింజలను వధించి తినుట మానవలెను.

(గౌ. 3-23)

17 సూ. అన్ని ప్రాణులందు సముఁడై యుండవలెను.

[గౌ, 3,24]

18 సూ, హింసించుటగాని గ్రహించుటగాని మానవలయును [గౌ. 3-25]

19 సూ. సత్యమును అసత్యమునుగాని సుఖమును దుఃఖమునుగాని, ఇహలోకముగాని పరలోకముగాని విడిచియాత్మను అన్వేషింపవలయును (ఆప. 2-9-10-13)

20 సూ. వర్ణముల ధర్మములు ఆశ్రమముల ధర్మములు చెప్పఁబడెను. [గౌ. 19-1]

21 సూ. వర్ణములు ఆశ్రమములు తమ తమ కర్మలువీని యందున్న వారు చనిపోయి కర్మ ఫలమనుభవించి పిదప శేష కర్మచే గొప్పదేశమున జాతిని, కులమును, రూపమును, ఆయువును, శ్రుతమును, వృత్తమును విత్తమును సుఖమును మేధస్సును పొందుదురు. (గౌ. 11-31)

## అథసర్వేషాం ప్రాయశ్చిత్తం

అనభ్యాసేన వేదానా మాచారస్య చవర్జనాత్
ఆలస్యాదన్న దోషాచ్చ మృత్యుర్విప్రాన్ జిఘాంసతి

22 సూ. అథఖల్వయం పురుషోయాప్యేనకర్మణాలిప్యతే
[గౌ. 19,2]

23 సూ. యద్వైతదయాజ్యయాజన, మభక్ష్య భక్షణ, మవద్యవదనం శిష్టస్యాక్రియా ప్రతిషిద్ధసేవనమితి
(గౌ. 19_3)

24 సూ. తత్రప్రాయశ్చిత్తం కుర్యాన్న కుర్యాదితి మీమాంసంతే
(గౌ. 19_4)

వివ:_ ప్రాయోనామతపః ప్రోక్తం చిత్తం నిశ్చయ ఉచ్యతే తపోనిశ్చయయోగాత్ ప్రాయశ్చిత్తం తదుచ్యతే। ప్రాయశశ్చపమం చిత్తం చారయిత్వాప్రదీయతే వర్షదాకార్యతేయత్తు ప్రాయశ్చిత్త మితిస్మృతం (అంగిరాః) వర్షదా=పరిషదా, ప్రదీయతే=విధీయతే)

నాభుక్తంక్షీయతేకర్మ కల్పకోటిశతైరపి।
అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మశుభాశుభం॥

25 సూ. నహికర్మ క్షీయతే (గౌ. 19-5)

26 సూ. తస్య నిష్క్రయణాని జపస్తపోహోమ ఉపవాసోదానం (గౌ. 19-12)

వివ:_ నిష్క్రమణాని=సంశోధనాని

**ఇంక నందఱకు ప్రాయశ్చిత్తములు చెప్పఁబడుచున్నవి**

వేదములు అభ్యసించకపోవుటచేతను ఉత్తమాచరణను వర్జించుటవల్లను సోమరితనమువల్లను దోషయుక్తాహారముభుజించుటవల్లను విప్రులను మృత్యువు చంపగోరుచున్నది.

22 సూ. మఱి యీ పురుషుఁడు గర్హ్యమగు కర్మచే నంటఁబడుచున్నాఁడు. (గౌ. 19-2)

23 సూ. యజింపదగని వానిని యజింపఁజేయుట, తినఁదగనివి తినుట, పలుకదగనిది పలుకుట, చేయవలసినది చేయకపోవుట, చేయరానిది చేయుట యని యీ విధముగ గర్హ్యకర్మ యుండును. (గౌ. 19-3)

24 సూ. అందుప్రాయశ్చిత్తము చేయవలయునో,చేయనక్కరలేదో మీ మాంస చేయుచున్నారు. (గౌ. 19-4)

ప్రాయమనఁగా తపస్సు చిత్తము అనఁగా నిశ్చయము తపోనిశ్చయముల యోగమువల్ల ప్రాయశ్చిత్తమనఁబడుచున్నది ప్రాయికముగా చిత్తమును నడపించుచున్న పరిషత్తుచే ఏది నిశ్చయించబడునో అది ప్రాయశ్చిత్తము అని యంగిరసుఁడు.

అనుభవింపకకర్మ కల్పకోటి శతములచేతను క్షీణింపదు చేసినది మంచిదైనను చెడ్డదైనను తప్పక అనుభవించి తీరవలయును

25 సూ. అనుభవింపక కర్మ క్షీణింపదు. [గౌ. 19-5]

26 సూ. ఆ గర్హ్య కర్మను జపము, తపస్సు, హోమము ఉపవాసము దానము అనునవి సంశోధించిపరిశుద్ధమొనర్చును [గౌ. 19-12]

26 సూ. ఉపనిషదో, వేదాంతాః, సర్వచ్ఛందస్సు సంహితా మధూ న్యఘమర్షణ, మథర్వ శిరో,రుద్రాఃపురుషసూక్తం రాజనరౌహిణే సామనీ, బృహద్రథంతరే, పురుషగతి, ర్మహానామ్న్యః మహావైరాజం, మహాదివాకీర్త్యం, జ్యేష్ఠసామ్నా మన్యతమత్ బహిష్పవమానకూశ్మాండాని, పావమాన్యః సావిత్రీ చేతిపావనాని [గౌ. 19-13]

వివ:- ఉపనిషదః=రహస్యబ్రాహ్మణాని, వేదాంతః=ఆరణ్యకాని,సర్వచ్ఛందస్సు సంహితాః=సర్వ వేదసంహితాః, మధూని="మధువాతాఋతాయతే"ఇత్యాదిమధుశబ్దయుక్తాని, అఘమర్షణం="ఋతంచ సత్యంచ" ఇత్యాది అథర్వశిరః=అథర్వ వేద ప్రసిద్ధ మంత్రభాగః, రుద్రాః=రుద్రమన్యవే ఇత్యాది రుద్ర శబ్దయుక్తాని, పురుషసూక్తం = సహస్రశీర్షాపురుషః, ఇత్యాది, రాజనరౌహిణే=ఇంద్రనరోనే మధితా హ వంతే ఇతి ఋచిగీతేసామనీ, బృహత్="త్వామిద్ధిహవామహే' ఇతి ఋచిగీతం, రథంతరం='అభిత్వాశురనోనుమః' ఇతి ఋచిగీతం, పురుషగతిః='అహమస్మి ప్రథమజాఋతస్య" ఇతి ఋచిగీతం, మహానామ్న్యః='విదామఘవన్" ఇతి ఋచిసామ, మహావైరాజం="పిబాసోమం ఇతి ఋచిగీతం మహాదివాకీర్త్యం 'విభ్రాడ్బృహత్పిబత్'ఇతిఋచి సామ,జ్యేష్ఠసామ్నా మన్యతమత్="శంనోదేవీః' చిత్రం దేవానాం ఇతి అనయోరేకం సామ, బహిష్పవమానం='ఉపాస్మైగాయత వరః" ఇత్యాద్యాః, కూశ్మాండాని="యద్దేవాదేవ హేళనం"ఇత్యాదీని, పావమాన్య'='పవమానలింగాని సాదిష్టయా మదిష్టయా" ఇత్యాదిని, సావిత్రీ=ప్రసిద్ధా

28 సూ. ఉపనిషత్తులు, వేదాంతములు, సర్వవేదసంహితలు, మధుప్రదయిత మంత్రములు, అఘమర్షణ మంత్రము, అథర్వ శిరస్సు, రుద్రశబ్దయుక్త మంత్రములు, పురుషసూక్తము, రాజనరౌహిణములనుసామలు, బృహద్రథంతసామలు, పురుషగతి, మహానామ్నులు, మహావైరాజము, మహాదివాకీర్త్యము, జ్యేష్ఠసామలలో ఏదో యొకటి, బహిష్పవమానము, కూశ్మాండ హోమములు, పావమానులు, సావిత్రి మంత్రము అనునవి పవిత్రము చేయునవి.

వివ:- మధుశబ్దయుతములు=మధువాతా ఋతాయతే మొదలగు మధుశబ్దయుక్త మంత్రములు, అఘమర్షణము=ఋతంచసత్యంచ మొదలగునవి. అథర్వ శిరస్సు=అరర్వవేద ప్రసిద్ధమగు మంత్రములభాగము, రుద్రశబ్దయుక్త మంత్రములు రుద్రమన్యవే ఇత్యాదులు. పురుష సూక్తము = సహస్రశీర్షాపురుషః మొదలదునవి, రాజనరౌహిణములు=ఇంద్రనరో నే మధితేహవంతే అను ఋక్కులోని సామలు, బృహత్=త్వామిద్ధిహవామహే అను ఋక్కులోనిది. రథంతరం=హభిత్వాసురనోనుమః అను ఋక్కులోనిది, పురుషగతి=అహమస్మి ప్రథమజా ఋతస్య అను ఋక్కులోనిది. మహానామ్నులు=విదామఘవ అను ఋక్కులోని సామ. మహావైరాజము=పిబాసోమం అనుఋక్కులోనిది. మహాదివాకీర్త్యము=విభ్రాడ్బృహత్ పిబత్ అను ఋక్కులోనిసామ. జ్యేష్ఠ సామలోనేదో యొకటి. శంనోదేవీః చిత్రందేవానాం అనునారెంటిలో నొకసామ, మహిష్పవమానం=ఉపాస్మై గాయతానరః లో నగునవి. కూశ్మాండములు=యద్దేవా దేవహేళనం లో నిగునవి. పావమానులు=పవమానలింగములు సాధిష్టయా మదిష్టయా లోనగునవి. సావిత్రి=సవితృ దేవతాక మంత్రము.

27 సూ. ఉపన్నాయేన వయోత్రితా, శాకభక్షతా,ఫల భక్షతా, ప్రసృతయావకో. హిరణ్యప్రాశనం, ఘృతప్రాశనం, సోమపాన మితిమేధ్యాని [బో. 19-14]

వివ:- ఉపసన్నా్యయః=అరాగ్రా, పరోవరీయసీవా

28 సూ సర్వే శిలోచ్చయాః, సర్వాః ప్రవంత్యః సరితః పుణ్యాః హ్రదాస్తీర్థా న్యృషినికేతనాని గోష్ఠక్షేత్ర వరుష్కందా ఇధిదేశాః [బో. 3,10,12]

29 సూ. అహింసా సత్యమస్తైన్యం సవనేషూదకోవస్పర్శ నం గురుశుశ్రూషా, బ్రహ్మచర్య మధశ్శయనం,మేకవస్త్రతానా శక ఇతి తపాంసి [బో. 3,10,14]

వివ:- ఇతి శబ్దేన ప్రాణాయామాదయో గృహ్యంతే

30 సూ. హిరణ్యం గౌర్వాసోఽశ్వో భూమిస్తిలా ఘృత మగ్నమితి దేయాని [గౌ. 19.17]

31 సూ. కృచ్ఛ్రాతి కృచ్ఛ్రౌ చాంద్రాయణమితి సర్వ ప్రాయశ్చిత్తం [గౌ. 1 -27]

32 సూ. త్ర్యహం ప్రాత స్తథాసాయం. త్ర్యహమన్య దయాచితం త్ర్యహం పరంతునాశ్నీయాత్ వరాశ ఇతికృచ్ఛ్రం [బో, 2,1,64]

33 సూ. యావత్సకృదాదదీత తావదశ్నీయాత్ పూర్వ వత్సోఽతి కృచ్ఛ్రః [బో. 2-1.16]

27 సూ. నీరు త్రాగి యుండు వ్రతము పూనుట, కూరలు తిని యుండుట, పండ్లు తినుట, కాచినగంజి త్రాగుట, హిరణ్య ప్రాశనము, ఘృతప్రాశనము సోమపానము అనునవి పవిత్ర కరములు.

28 సూ. ఎల్ల పర్వతములు, ఎల్ల నదులు, పుణ్యనదులు హ్రదములు, తీర్థములు, ఋష్యాశ్రమములు, క్షేత్రములు, దేవాలయములు అనునవి పవిత్రకరమగు దేశములు(బో. 3_10-13)

29 సూ. అహింస, సత్యము, అచౌర్యము, సంధ్యలందు సంధ్యావందనము, గురుశుశ్రూష, బ్రహ్మచర్యము, కటికనేలపైఁ బరుండుట, ఒకటే వస్త్రము ధరించుట అభోజనము ప్రాణాయామాదులు తపస్సులు. (బో. 3_10_14)

30 సూ. బంగారము, గోవులు, వస్త్రములు, గుఱ్ఱములు, భూమి, తిలలు, నేయి, అన్నము అనునవి దానము చేయవలసినవి. (గౌ. 19-17)

31 సూ. కృచ్ఛ్రము, అతికృచ్ఛ్రము, చాంద్రాయణము అనునవి అన్ని పాపములకుఁ బ్రాయశ్చిత్తములు అన్ని పాపములకు బ్రాయశ్చిత్తములు. (గౌ. 19_20)

32 సూ, మూఁడు దినము లుదయమునను, తరువాతి మూఁడురోజులు సాయంకాలమునను, పిదపమూఁడు దినములు అయాచితముగ లభించినదియు, తరువాత మూఁడు రోజులు పూర్తిగ భుజింపకుండుటయుఁజేయవలెను. దానిని పరాకమని కృచ్ఛ్రము అని యందురు.

33 సూ. కృచ్ఛ్రమునందువలెఁ జేయుచు, భుజించు అన్నమును మాత్రము ఒకసారి చేతి కెంతవచ్చునోయంతయే గ్రహించిభుజింపవలెను. దీనినిఅతికృచ్ఛ్రమందురు(బో. 2,1,16)

34. సూ. అబ్భక్షస్తృతీయం స కృచ్ఛ్రాతి కృచ్ఛ్రః
(బో. 2,1,67)

35 సూ. ఏకైకం హ్రాసయేత్పిండం కృష్ణే. శుక్లేనవర్ధయేత్ ఉపస్పృశం స్త్రిషవణమేతచ్చాంద్రాయణం స్మృతం
(మను. 11_216)

36 సూ. హార్దికపశ్చాత్తాప ఏవ సర్వప్రాయశ్చిత్తమితి గాంధీ.

37 సూ. తాదృశ పాపస్య పునరకరణమేవ వాస్తవిక పశ్చాత్తాపస్య సూచకమిత్య హింసాచార్యో గాంధీ

38 సూ. ధర్మం చరత మాఽధర్మం, సత్యంవదత నానృతం దీర్ఘంపశ్యత మాహ్రస్వం, పరంపశ్యత మాఽపరం
[వసి, 30-1]

ఇతి
ఆర్ష ధర్మసూత్రాణి

34 సూ. నీరు మాత్రము త్రాగి యుండుట మూఁడవ రకమైనది దానిని కృచ్ఛ్రాతి కృచ్ఛ్రమందురు. (బో. 2-1-67)

35 సూ. కృష్ణపక్ష మందు పాడ్యమి మొదలు అమావాస్య వఱకు ఒక్కొక్క ముద్ద తగ్గించుచు, శుక్లపక్ష మందు పాడ్యమి మొదలు పౌర్ణమి వఱకు ఒక్కొక్క ముద్ద హెచ్చించుచు మూఁడు సంధ్యలందు ఉపాసన చేయుచునుండుట చాంద్రాయణ మనఁబడును. (మను. 11-216)

36 సూ. హృదయ పూర్వకముగఁ బశ్చాత్తాప పడుటయే యన్నింటికిఁ బ్రాయశ్చిత్తమని గాంధి మహాత్ముఁడు.

37 సూ. అటువంటి పాపమును మఱల జేయుకపోవుటయే వాస్తవిక పశ్చాత్తాపమునకు సూచిక మని యహింసాచార్యుఁడగు గాంధి మహాత్ముఁడు.

38 సూ. ధర్మము చేయుడు; అధర్మము చేయకుఁడు సత్యము పలుకుఁడు, అసత్యము పలుకకుఁడు, దీర్ఘముగఁ జూడుఁడు, సంకుచిత దృష్టితోఁ జూడకుఁడు, పరమును జూడుఁడు ఇహమును జూడకుఁడు (వసి. 30-1)

ఇది

బ్రహ్మశ్రీ చర్ల నారాయణశాస్త్రి జనక గురువరప్రాప్త విద్యుఁడును వెంకమాంబా పుత్త్రుఁడును అగు గణపతిశాస్త్రిచే అనువదింపఁబడిన ఆర్ష ధర్మసూత్రములు

## గౌతమ సూత్రే క్రియాకాండోద్ధృత ఆచారః

1 సూ. ఉత్థాయి పశ్చిమే యామే శాంతమానసోఽ వని ద్రిఃసమౌపాొణాపా నౌ ధృత్వా దివాకరం సముత్థాప్య దివాకరేణ ప్రోద్భుల్లితే పద్మే మానసం హంసం సమాశ్రయేత్

2 సూ. అంగుష్ఠ మాత్రం పురుషం పరాపరం జ్యోతీరూపం సమాలోక్య దివ్యేన చక్షుషా యధా లాభముషః కాలే స్థిత్వాస్తోత్రై రనేకధా స్తుత్వా

3 సూ. సోపానత్కో బహిర్యాయాత్ సజలాశయం విరళం అస్థి విణ్మూత్ర భస్మ కీటాదికం నాక్రామన్

4 సూ. అయజ్ఞాంగ తృణచ్ఛన్నే భూతలే మలం విసృజేత్

5 సూ. మునిదేవాలయ, వల్మీక, జల, భస్మ గోమయ, దూర్వా, సస్య, క్షేత్ర, సరః, పర్వ, తాశం, భూ[illegible]షు నోత్సృజేన్మలం

6 సూ. నభో, విణ్మూత[illegible], [illegible], గో, విప్ర స్త్రీ దేవతాభి ముఖో మూత్ర పురీషే న విసృజేత్

7 సూ. పథిక విశ్రాంత్యుపయోగిచ్ఛాయా[illegible]ం న విసృజేత్

## గౌతమ సూత్రమందుఁ జెప్పఁబడిన దిన కృత్యమునుండి తీయఁబడిన భాగము

1 సూ. చివరిజామున రాత్రిలేచిశాంతమనస్కుడై నిద్ర మాని ప్రాణాపానములను సమముగఁ దాల్చి సూర్యునిలేపి సూర్యునిచేత వికసింపఁబడిన హృదయపద్మమందలి మానసమ నెడి హంసను ఆశ్రయింపవలయును.

2 సూ. అంగుష్ఠ మాత్రమెయున్న, పరావరస్వరూపుఁ డును, జ్యోతిస్స్వరూపుఁడు అగు పరమపురుషుని దివ్యనేత్ర ముతోఁ జూచి యథాలాభముగ నుదయమునునుండి స్తోత్రము లచే ననేక విధముల స్తుతించి

3 సూ. చెప్పులు తొడుగుకొని జలాశయముగల బాహ్య ప్రదేశమునకు ఎముకలు, మలమూత్రములు, భస్మము, పురు గులు మొదలగు వానిని దాటకుండ వెళ్లవలయును,

4 సూ. యజ్ఞాంగములు కాని తృణముచేఁ గప్పఁబడిన నేలపై మలము విడువవలయును.

5 సూ. ఋష్యాశ్రమములందు, దేవాలయమందు, పుట్ట మీఁద, నీటిలోను, బూడిదపైని, పేడమీఁద, గడ్డిపైని, చేలలోను హలములందు, సరస్సులందు, కొండలమీద, రాళ్ళమీద నేల గోతులందు మలము విడువరాదు

6 సూ. ఆకసమునకు, మలమూత్రముల దిక్కులకు, చం ద్రునికి, అగ్నికి, సూర్యునికి, ఆవులకు, బ్రాహ్మణులకు, స్త్రీలకు అభిముఖముగ మలమూత్రములు విడువరాదు.

7 సూ. బాటసారులు విశ్రాంతి పొందుటకుఁ దగిన నీడ యందు మలమూత్రముల విడువరాదు.

8 సూ. కృష్టే; పథ్యప్సుచ

9 సూ, మలం స్వేల్పగర్తే పేస్సృజ మృత్తికా భస్మాది నాచ్ఛాదయే ద్యథానదృశ్యతే, దుర్గంధశ్చ నాయాతి బహి రితి గాంధీ

10 సూ: శౌచస్థానం సమాగమ్య శౌచంకామండలుస్థైః స్తోయై రాచరే ద్వామ పాణినా

11 సూ. పేశ్చాద్దేశాంతరగతే ఉపవీతవా నాచామేత్

12 శౌచాచార విహీనస్య సమస్తాః క్రియా నిష్ఫలాః

13 సూ. అవ్యగ్రః ప్రాఙ్ముఖో నిషణ్ణో దంతధావనం కుర్యాత్

14 సూ. సార్ద్రం, దంతకాష్ఠ, సమంఛిన్నం సత్వకపర్వకం కషాయం తిక్తం కటుకం కంటకాన్వితం, సుగంధిం, వృక్ష గుల్మా క్షీరిణోవా భక్షయేత్

15 సూ. దంతధావనం కీటాద్యదూషితం ఉచిరం వితస్తి మాత్రం

16 సూ. కకు, భాశోక, జంబ్వామ్ర, కపిత్థవకుళోద్భవం గృహమేధి నా మతి ముఖ్యం

17 సూ. అపామార్గం ప్రశస్తం

18 సూ: భానా వభ్యుదితే వికష్ఠతిం వినా దంతధావనం న కుర్యాత్

8 సూ. దున్నిన నేలపైని, దారిలోను, నీళ్ళలోను మలము విడువరాదు.

9 సూ. మలమును చిన్న గోతిలో విడిచి మట్టి బూడిద మొదలగు వానిచేఁ గనిపింపనట్లును, దుర్గంధము పైకి రానట్లును గప్పవలయునని గాంధి మహాత్ముఁడు.

10 సూ. శౌచస్థానమునకు వచ్చి కమండలు జలములలో ఎడమ చేత శౌచము చేసికొనవలయును.

11 సూ. పిదప మఱొక చోటికి పోయి యుపవీతముగ నుండి యాచమింపవలెను.

12 సూ. శౌచాచారము లేని వాని క్రియలెల్ల నిష్ఫలములగును.

13 సూ. శ్రద్ధతో తూర్పు ముఖముగఁ గూర్చుండి దంత ధావనము చేయవలెను.

14 సూ. పై చర్మముతోను గణుపులతోనుగూడి, వగరుగ గాని చేఁదుగఁ గాని కటువుగఁ గాని పరిమళము గలిగి గాని యున్న సమముగఁ గోయఁబడిన ముళ్ళుగల వచ్చిదైన పలుదోము పుల్లనుగాని పాలుగలచెట్లు పొదల పుల్లలనుగాని నమలి కడుగుకొనవలయు.

15 సూ. పలుఁదోముపుల్ల పురుగులు మొదలైన వానిచేఁ బాడుచేయటఁబడక జేనెఁడు పొడుగు గలిగి యుండవలయును

16 సూ. మద్ది, అశోకము, నేరెడు, మామిడి, వెలగ, పొగడ చెట్లు పుల్లలు గృహస్థులకు మిగుల ముఖ్యమైనవి.

17 సూ. ఉత్తరేణి పుల్ల ప్రశస్తము.

18 సూ, గానుగ మఱ్ఱి వేపపుల్లలును శ్రేష్ఠమైనవని ఆధునికులు.

19 సూ. సూర్యుఁడుదయింపక ముందె దంత ధావనము చేయవలయు.

20 సూ. కుర్యాచ్చేన్మునయో, మంత్రా, వేదా, దేవాః పితరస్తత్పరాముఖాభవంతి

21 సూ. పునరాచమ్య అహరహః స్నానం దేవర్షి, పితృ తర్పణం స్వాధ్యాయోఽతిథి కార్యంచ షట్కర్మాణి దినేదినే

22 సూ. రవావనుదిత ఉషస్యుషసి సింధు సంగమ కాసార. తటా నద నదీషు స్నానం ప్రాజా పత్యేన తుల్యం మహాపాతక నాశనం

23 సూ. దేవాఽపూర్వాభిముఖో మునీనుత్తరాభిముఖః పితౄన్ దక్షిణాభిముఖో, జలమధ్యే ప్రతర్పయేత్

24 సూ. నాభేరధః ప్రక్షాళనమూర్ధ్వంచార్ద్ర వాససా శరీర సంమార్జనం కాపిలం

25 సూ. అవ్యయానంద చిత్స్వరూప విష్ణు చింతనం మానసం

26 సూ. సదశమ ఖండం శ్వేతం ధౌతవస్త్రద్వయంస్నానే దానే జపే హోమే దేవపూజనేధార్యే

27 సూ. మౌనాభావే స్నానం హరతి తేజః

28 సూ. వటోరేకముపవీతం, గృహస్థారణ్య వాసినోర్ద్వే, తృతీయ ముత్తరీయార్థం ధార్యం, ఏకమేవ యతీనాం స్యాదితి

20 సూ. సూర్యుడుదయించినపిదపఁ జేసినచో మునులు మంత్రములు, వేదములు దేవతలు, పితరులు వానికిఁ బరాఙ్ముఖులగుదురు.

21 సూ. తిరిగి యాచమనము చేసి ప్రతి దినము స్నానముఁ దేవ, ఋషి, పితృతర్పణమును, సాధ్యాయము, అతిథి కార్యమును యజన యాజనాషట్కర్మలును ప్రతి దినము చేయవలయును.

22 సూ. సూర్యుఁ డుదయింపక ముందె ప్రతి యుషఃకలమందును సముద్ర సంగమ మందు, సరస్సులందు, చెఱువులందు, నదములందు నదులందు స్నానము చేయుట ప్రాజాపత్యముతో సమానము మహా పాతకము నశింపఁజేయును.

23 సూ. తూర్పుమొగమై దేవతలకును, ఉత్తరమొగమై మునులకు, దక్షిణమొగమై పితరులకు, జల మధ్య తర్పణము చేయవలెను.

24 సూ. నాభిక్రిందిఁ గడుగవలయు, పై భాగము తడి గుడ్డతో శరీరమును దోముకొనుట కపిలోక్త విధానము.

25 సూ. అవ్యయానంద చిత్స్వరూపుఁడగు విష్ణువును మనస్సున ధ్యానింపవలయు.

26 సూ. కొంగులుగల, చిరుగని,తెల్లని యుదికిన రెండు వస్త్రములు స్నానమున, దానమున, జపమున, హోమమున, దేవపూజలందు ధరింపవలయు.

27 సూ. మౌనము లేనిచో తేజస్సును స్నానము హరించును.

28 సూ. వటువు ఒక యజ్ఞోపవీతమును, గృహస్థుఁడు రెండు, వానప్రస్థుఁడు రెండు, ఉత్తరీయము కొఱకు మూఁడవది, యతి ఒకటి ధరింపవలెను.

29 సూ. శుద్ధక్షేత్రోద్భవం కార్పాసం సమాదాయ జీవ భర్తృ యా బ్రాహ్మణ్యా వా సూత్రింకారితం

సూ. బాహ్యసూత్రాభావేఽపినక్షతి రితి గాంధీ

30 సూ. పద్భ్యాం న జలంతాడయేత్

31 సూ. నా శుద్ధో జలం ప్రవిశేత్

32 సూ, అస్పృశ్యకృతమూత్ర ష్ఠీవన రేతాం స్యప్సున నిక్షిపేత్

33 సూ, ధనుస్సహస్రాణ్యష్టౌ గతిర్యస్యానదీ నద్యాం విద్యమా నాయామన్యాచారిషు నస్నాయాత్

34 సూ తదభావే గృహే కుర్యాత్ స్నానం ప్రతిదినం

35 సూ. ఏకవాసా జలం నప్రవిశేత్

36 సూ, ఆచమ్యతీరస్థః క్షాళయేన్మలం దేహజం

37 సూ. జప, హోమ, దాన, వైశ్వదేవ, శివార్చన శ్రాద్ధేషు తిర్యగ్భస్మ నా త్రిపుండ్రధారిణే సర్వమక్షయం భవతి

38 సూ. స్నాన దాన జప హోమ సంధ్యాతర్పణ పూజ కేషు పవిత్రపాణిస్స్యాత్

39 సూ. కుశమూల కుశమధ్య కుశాగ్రేషు క్రమేణ బ్రహ్మ విష్ణు మహేశ్వరాస్తిష్ఠంతి, తస్మాన్నిత్యంధారయేత్

40 సూ. స్థిరమనాః ప్రాఙ్ముఖ స్సమేపీఠ ఉపవిశ్య పాదౌహస్తౌ చ ప్రక్షాళ్య జానుమధ్యకరోద్వి రాచమ్యతత స్సంధ్యాముపాసీత

26 సూ. మంచి క్షేత్రమునఁ బండిన ప్రత్తి తెచ్చి జీవద్భర్తృకచేఁగాని బ్రాహ్మణ స్త్రీచేఁ గానీ యజ్ఞోపవీత సూత్రము చేయింపబడి యుండవలయు.

వివ:- (యజ్ఞోపవీమును గూర్చి చూ. శౌచప్రకరణం)

30 సూ. కాళ్ళతో జలమును గొట్టరాదు.

31 సూ. అపరిశుద్ధుఁడై జలము ప్రవేశింపరాదు.

32 సూ_ రక్తము, మల మూత్రములు, ఉమ్మి, రేతస్సులను నీటిలో విడువరాదు,

33 సూ- 1008 వింటిబద్దల వెడల్పు గలది నది, నది యుండగఁ నితర జలములందు స్నానము చేయరాదు.

34 సూ- నదిలేచిచో ప్రతిదినము స్నానమింటియందు చేయవలె

35 సూ_ ఒంటిబట్టతో జలమును ప్రవేశింపరాదు

36 సూ_ ఆచమించి గట్టుమీద నుండి దేహపు మలమును కడుగవలెను_

37 సూ, జప, హోమ, దాన, వైశ్వదేవ, శివార్చనశ్రాద్ధములందు అడ్డముగా విభూతిచే త్రిపుండములు ధరించిన వానికి అన్ని యక్షమగును.

38 సూ స్నాన దాన జపహోమ సంధ్యాతర్పణ పూజలందుఁ బవిత్ర పాణియై యుండవలయు

39 సూ, దర్భల మొదట బ్రహ్మ, దర్భల మధ్య విష్ణువు దర్భల కివర మహేశ్వరుఁడు ఉండును గాన వానిని నిత్యము ధరింపవలయు

40 సూ- స్థిరబుద్ధి గలవాఁడై, తూర్పు మొగమై సమపీఠమునఁ గూర్చుండి కాళ్ళు కడుగుకొని మోకాళ్ళ మధ్య చేతులుంచి రెండుసార్లు ఆచమించి సంధ్యోపాసన చేయవలయును

41 సూ- ఆపనే అసమానసీనః ప్రాణాయామాన్ సమాచరేత్

42 సూ- సంధ్యాహీనో నిత్యమశుచిస్స్యాత్

43 సూ- ప్రార్థనావాకార్యా తయాహీనోఽశుచిరితి గాంధీ

44 సూ- సూర్యనక్షత్రవర్జితాయా అహోరాత్రయో స్సంధిస్సా సంధ్యా సమాఖ్యాతా ఋషిభిస్తత్త్వదర్శిభిః

45 సూ- దృష్టనక్షత్రా ప్రాతస్సంధ్యోత్తమా

46 సూ- శ్రేష్ఠాఽర్ధార్కమండలాసాయంసంధ్యా

47 సూ- స్వస్థస్సన్నేకాహమప్య నుపాస్యంశ్చేత్పతితో భవతి

48 సూ- ప్రాణానాయమ్య సంప్రోక్ష్య కరాభ్యా ముదకమాదాయ గాయత్ర్యాఽభిమంత్రితం పూర్వాభి ముఖస్తిష్ఠస్త్రిరూర్ధ్వం సంధ్యయోః క్షిపేత

వివ:- గాయంతంధ్యా యంతంత్రాయత ఇతి గాయత్రీ

49 సూ- ప్రాతః ప్రాఙ్ముఖ స్తిష్ఠ న్నాసూర్యదర్శనాత్సావిత్రీంజపేత్

50 సూ- అతారకోదయాత్సాయం ప్రత్యఙ్ముఖ ఆసీనస్సావిత్రీం జపేత్

41 సూ- ఆసనమునం గూర్చుండి ప్రాణాయామములు చేయవలెను

42 సూ- సంధ్యోపాసన చేయనివాఁడునిత్యమును అశుచి యగును

43 సూ, ప్రార్థనగాని చేయవలయు నది చేయనిచోఁ గూడ అశుచి యగునని గాంధిమహాత్ముఁడు

44 సూ- సూర్యుఁడు నక్షత్రములు కనిపింపని రాత్రిం బగళ్ల సంధ్యను తత్త్వదర్శులగు ఋషులు సంధ్యయందురు

45 సూ- నక్షత్రములు కనిపించు ప్రాతస్సంధ్య యుత్తమమైనది-

46 సూ- సూర్యమండలము సగము కనిపించు సాయం సంధ్య శ్రేష్ఠమైనది

47 సూ- ఆరోగ్యవంతుఁడై యుండి యొకరోజైనను సంధ్య నుపాసింపనిచో పతితుఁడగును

48 సూ- ప్రాణాయామము చేసి నీరు చల్లుకొని చేతులతో గాయత్రిచే మంత్రింపఁబడిన నీరు తీసుకొని సూర్యుని కెదురుగ సంధ్యలందు పైకి మూఁడుసార్లు చిమ్మవలయు

49 సూ- ప్రొద్దుట తూర్పుముఖమై యుండి సూర్యుఁడు కనిపించువరకు సావిత్రిని జపింపవలయు

వివ:- గానము చేయువానిని అనఁగ ధ్యానము చేయు వానిని రక్షించునది గాన గాయత్రి

50 సూ- నక్షత్రములు కనిపించునంతవఱకు సాయంకాలము పడమర ముఖమై సావిత్రిని జపింపవలయు

51 సూ- తత్కాల జనితం దశభిః శతేనా హోరాత్రకృత పాతం సహస్రేణ వర్షజం కిల్బిషం గాయత్రీహంతి

52 సూ- గృహేజప్యమేకగుణం, నద్యాంద్విగుణం గోష్ఠే శత గుణం, అగ్న్యగారే శతాధికం, శుద్ధక్షేత్రతీర్థేషు దేవతా సన్నిధౌ దశ కోటీనాం సహస్రం, అనంతంశివసన్నిధౌ

53 సూ- జ్ఞానసిద్ధిః కృష్ణాజినే

54 సూ- వ్యాఘ్ర చర్మణి మోక్షః

55 సూ- తతస్సూర్యముపాసీత

56 సూ, సమాచమ్యసమాదాయ తీర్థోదకమాత్మనో మందిరం గచ్ఛేత్

57 సూ- స్వస్వశాఖోక్త విధానేత నిత్య హోమం కుర్యాత్

58 సూ- బ్రహ్మయజ్ఞేన విధివత్కృత్వాతర్పణమా చరేత్

29 సూ- తతోదేవ గృహంగత్వా పూజాసంభారవా నుప విశ్య ఆననే శుద్ధే దేవమర్చయేత్

60 సూ- అవాహ, లాసన, పాద్యార్ఘ్య, స్నానోద్వర్తన వస్త్రోపవీత. గంధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యాచమన, ఫల తాంబూల ప్రదక్షిణై రుపచారైః షోడశభి రిషదేవం సమర్పయేత్

51 సూ. పది ప్రాణాయామములచే నప్పుడే చేసిన పాపమును, నూఱు ప్రాణాయామములచే రాత్రి పగలు చేసిన పాపమును, వేయి ప్రాణాయామములచే సంవత్సరము చేసిన పాపమును గాయత్రి పోఁగొట్టును

52 సూ. గృహమందు జపము ఒక ఫలమిచ్చును, నది యందు జపము రెట్టింపు, గోశాలయందు నూఱురెట్లు, అగ్నిశాల యందు నూఱుకంటె నెక్కువ, శుద్ధక్షేత్రతీర్థములందు దేవతల దగ్గర పదివేలకోట్లు, శివసామీప్యమందు అనంతమును ఫలము గలుగును.

53 సూ. లేడిచర్మముమీఁద జపించిన జ్ఞానముసిద్ధించును

54 సూ. పెద్దపులి చర్మముమీఁద జపించిన మోక్షముసిద్ధించును

55 సూ. పిదప సూర్యుని నుపాసింపవలయు

56 సూ. చక్కఁగా ఆచమనముచేసి తీర్థోదకమునీరు తీసుకొని యింటికి వెళ్లవలెను.

57 తమతమ శాఖయందుఁ జెప్పినరీతిగ నిత్యహోమము చేయవలెను

58 సూ. బ్రహ్మయజ్ఞముచేత యథావిధిగచేసి తర్పణము చేయవలెను.

59 సూ. పిదప దేవగృహమునకుఁబోయి పూజాసంభారములు గలిగినవాడై గూర్చుండి పరిశుద్ధాసనమున దేవునిబూజింపవలె

60 సూ పిలిచి గౌరవించుట, ఆసనమిచ్చుట, కళ్ళుకడుగ నీరిచ్చుట, అర్ఘ్యము, స్నానము, తలంటుట, వస్త్రము, ఉపవీతము, గంధము, పుష్పలు, ధూపము, దీపము, నైవేద్యము ఆచమనము, పండ్లు, తాంబూలము, ప్రదక్షిణలు అను పదునాఱు ఉపచారములచే ఇష్ట దేవుని బూజింపవలయును

61 సూ. పురుషసూక్తేన గాయత్ర్యా వా షోడశోపచారైః తల్లింగైరపి మంత్రైర్నామమంత్రైః ప్రణవేనైకకాలం త్రికాలం వా సాలగ్రామే, మణౌ, మంత్రే, ంస్థండిలే, ప్రతిమాయాం హరేః పూజా కార్యా

62 సూ. రూపం హృది, నామ ముఖే, హరేర్నైవేద్య ముదరే, పాదోదకం చ మస్తకే,తులసీయస్య కర్ణే సోఽచ్యుతో భవతి

63 సూ. తతః గురూన్ వృద్ధాన్ శ్రోత్రియాంశ్చాభివాదయేత్

64 సూ. మధ్యాహ్న పర్యంతం తాళపర్ణాసనాసీనో వేదాధ్యయనం చరేత్

65 సూ. అథవా శిష్యేభ్యః ప్రయచ్ఛేత్

66 సూ. తతో మాధ్యాహ్నిక విధిం కృత్వా భుంజీత

67 సూ. కృతకృత్యః పోష్యవర్గజనోపేతో భుంజీత

68 సూ. మాతృ, పితృ, గురు, భ్రాతృ, పుత్రదారాభ్యాగతాతిథయః పోష్యవర్గ

69 సూ. అజ్ఞాతకులగోత్రోఽధ్వగః శ్రాంత స్సంప్రాప్తో గృహం వైశ్వదేవాంతే సోఽతిథి స్స్వర్గసంగ్రహః

70 సూ. యస్య గృహా ద్భగ్నాశోఽతిథి ర్నివర్తతే స తస్య దుష్కృతం దత్వా పుణ్యమాదాయ గచ్ఛతి

61 సూ. పురుషసూక్తముతోఁ గాని గాయత్రితోఁ గాని షోడశోపచారములచే షోశోపచారలింగములుగల నమః అనిచివరగల మంత్రములచేఁ బ్రణవముచే ఒకసారి గాని రెండుసార్లు గాని సాలగ్రామమందు, మణియందు, మంత్రమందు, నేలమీద ప్రతిమయందు హరిపూజ చేయవలయు

62 సూ. హరిరూపము హృదయమందు హరినామము ముఖమునందు హరిప్రసాదము ఉదరమున హరిపాదోదకము తలమీద హరిని పూజించిన తులసీదళము చెవియందు ఎవనికుండునో వాఁడు అచ్యుతుఁడగును

63 సూ. పిదప గురువులకు, పెద్దలకు శ్రోత్రియులకు నమస్కరింపవలెను

64 సూ. మధ్యాహ్నముదాఁక తాటియాకుల దర్భల యాసనముపైఁ గూర్చుండి వేదము చదువవలెను

65 సూ. శిష్యులకుఁ గాని వేదము చెప్పవలయును

66 సూ పిదప మధ్యాహ్నకృత్యము చేసి భుజింపవలెను

67 సూ. కృత్యములు ముగించి పోష్యవర్గజనులతోఁ గూడి భుజింపవలయును

68 సూ. తల్లి, దండ్రి, గురువులు, అన్నదమ్ములు, పుత్రులు భార్య అభ్యాగతులు, అతిథులు పోష్యవర్గమనఁబడుదురు

69 సూ. కులగోత్రములు దెలియని, అలసిపోయిన వైశ్వదేవాంతమందు వచ్చిన బాటసారి యతిథి. అతఁడు స్వర్గమును సంగ్రహింపజేయువాఁడు

70 సూ. ఎవనిగృహమునుండి యతిథి భగ్నాశుఁడై మరలునో వానికి తన పాపమునిచ్చి వాని పుణ్యమును గ్రహించి పోవును

71 సూ. సుపూగం సుపత్రం సువాసనసమన్వితం దత్వా సురేభ్యో నివేద్యభ్యస్తత, స్తాంబూలం భక్షయేత్

72 సూ. దివాస్వానం మైధువంచ ననుర్వీత

73 సూ. యది కుర్యాత్క్రమేణ ఆయుః పుణ్యహానిః

74 సూ. ఆ సాయం సిద్ధాంత చింతనం కుర్యాత్

75 సూ, తతః సాయంతనీం సంధ్యాం కుర్యాత్

76 సూ. రాత్రౌ భోజనం కుర్యాత్ బలవీర్య వివర్ధనం

77 సూ. అ లక్ష్మీ పరిహారార్థం యత్కించిత్పుష్పగంధె

78 సూ. శయీత శుద్ధశయ్యాయాం భార్యయా సహ నిషిద్ధ దివసేషు వర్జయిత్వా

79 సూ, ఏవం విజ్ఞాయ కర్తవ్యా దినచర్యా

80 శూ. పార్థనాంకృత్వా సర్వదినం ప్రాణిసేవాయాంచ దైవమనుపశ్యన్ నత్సాధనానాం ద్వారా దినం యాపయితవ్య మితి గాంధీ

81 శూ. పునః ప్రాతరుత్థాయ యథోక్త మఖిలంచరేత్

82 సూ, ఏవంక్రియాకాండ మాచరతో ధర్మార్థ కామ మోక్షాణాం సిద్ధి ర్భవతి సిద్ధి ర్భవతి

ఇతి

గౌతమోక్త దినకృత్యం

71 సూ. మంచివక్కలు, మంచి యాకులు మంచి సువాసనగల తాంబూలమును దేవపలకు బ్రాహ్మణులకిచ్చి పిదప భుజింపవలయును

72 సూ. పగలు నిద్రను మైథునమును చేయరాదు

73 సూ. చేసినచో ఆయువి పుణ్యము క్షీణించును

74 సూ. సాయంకాలమువఱకు సిద్ధాంతముల చింతనము చేయవలయును

75 సూ. పిదప సాయంసంధ్య నుపాసింపవలెను

76 సూ. రాత్రి బలవీర్యములను వృద్ధిపొందించు భోజనము తినవలెను.

77 సూ. అశుభ పరిహారమునకై ఏదో కొంచెము పువ్వులు గంధము పూసుకొనవలయు

78 సూ. పిదప నిషిద్ధ దినములువదలి శుద్ధశయ్యయందు భార్యతో శయనింపవలెను

79 సూ. ఇట్లు తెలిసి దినచర్య చేయవలయును

80 సూ. ప్రార్థనచేసి దినమంతయుఁ బ్రాణిసేవలో భగవంతుని జూచుచు భగవత్సాధనములద్వారా గడపవలయునని గాంధిమహాత్ముఁడు

80 సూ. తిరిగి ప్రొద్దుటలేచి యథోక్తమగు సకల కర్మలు చేయవలయును

82 సూ. ఇట్లు క్రియాకాండము నాచరించుచు దేవుని ధ్యానించు వానికి ధర్మార్థకామమోక్షములు సిద్ధించును

ఇది

చర్ల గణపతిశాస్త్రిచే తెనిగింపబడిన

గౌతమోక్త దినకృత్యము